

నా యెనక యెవరోను......?

చిత్రకారుడు: శ్రీ ఎ. సదాశివయ్య.

# విషయసూచిక



ముఖ చిత్రం:— పశ్చిమ గోదావరి జిల్లా పోలవరం తాలూకాలోని కోట రామచంద్రపురంలో 1962 మార్చి 22 వ తేదీన కోయలు తమ ధనుర్విద్యా కౌశలం ప్రదర్శించారు. ఈ ధనుర్విద్యా ప్రదర్శనను ప్రభుత్వపు ఏజెంటు ప్రతి సంవత్సరం ఏర్పాటు చేస్తారు.

వెనుక అట్ట:— 1961—62 సం. నికి రాష్ట్రంలో ఉత్తమగ్రామీణ రేడియో గోష్ఠిగా నిర్ణయించ బడిన పిల్లల మర్రి రేడియో గ్రామీణ గోష్ఠి సభ్యుల సమావేశం.

# సహకార వ్యవస్థ

శ్రీ పాలా వేంకట సుబ్బయ్య

పదుగు రొక్క-పనిని-ఫలితార్థులై చేరి
యైక్యంబుగాఁ జేయు - మనున దెద్ది?
అప్పుల పాలయి-ముప్పులఁ బడునాడు
బాహాటముగ సాయ-పడున దెద్ది?
చౌకవడ్డీలకు - చాలినంత ధనము
పరపతి యనుకూల-పరుచు నెద్ది?
వ్యవసాయము ననేమి-వాణిజ్యము ననేమి
చేయూతఁగాఁ బని-సేయు నెద్ది?
అదియె సహకార సంస్థయో-యయ్యలార!
ఆలసించుట దేల మీ - రందుఁ జేరి,
భాగ్యమును నెమ్మదిని బొంది - బలము నంది
అన్యదేశాల వలెను మీ-రలరుఁడయ్య.

కర్షక వర్యుల-కందు డెందములందు
హాసధావళ్యంబు-లావరింప,
తామసీ పటలయు-తంబగు వ్యాపార
ములలోన నవకాంతి-తొలఁకరింప,
అశ్రుపూరితలోచ-నాసారములలోన
నాహ్లాద వీచికలంకురింప,
సంసార గర్భిత సంతాపములలోన
జీవితాశా సుధల్-చిలుకరింప.
భరత ఖండాన నడుగిడి - భారతీయ
రైతు లోకమ్ము నొకయింత - ప్రబలఁ జేసె.
నర్ఘ్య పాద్యాది విధుల నాహ్లాద మొదవ
నింట నింటను స్వాగత- మీయరయ్య

మాన సాంతర్గత- మహిత కుతూహల
జలనిధిఁ దేల్పంగఁ- జాలు నావ;
సంసార సంజాత- సంకీర్ణ దుర్భర
పరితాప ముడుప తు - పాకిదెబ్బ,
నిశ్చల పరిపూర్ణ- నిగమ సుఖంబులఁ
జూప విద్యుచ్ఛక్తి- సోయగంబు;
పరిపాలనము సేయు- వరసూత్రములనెల్ల
క్రమముగా నొసఁగు శా- స్త్రంపు కలిమి;
ధర్మవర్తనంబు మఱి కు- కర్మవర్జి
తంబు నలవడ జేయుచుఁ- దనరు నదియు,
కార్యముల మంచి మార్గానఁ- గనెడు నదియు.
నొనర సహకార సంస్థయేఁ- గనుఁగొనుండు.

వ్యక్తి యందఱి బాగును- వాంఛసేయు,
నందఱును వ్యక్తిబాగును- నాత్మవాంఛ
సేతురనుటయె సూత్రమ్ము: శ్రేయమిడును
సంఘ కార్యాలజస్రమ్ము - సభ్యతతికి.

జాతి మత భేదముల పొంత- జనక సర్వ
మాన వావళి కెల్లను- మంచిత్రోవఁ
జూపనున్నది సహకార- సూత్ర చయము
స్వాగతంబును చాటుడి-భాగ్యమొదవు.

భూములు ఋణదాత-భుక్తమ్ములోనుండ
విడిపించుకోఁద్రోవ-వెదకువారు,
అప్పులాస్తుల మించ-ముప్పుతెప్పలుఁబడి
తప్పించుకోమది- దలఁచువారు,
వసియింపఁగా గృహ-వసతి గానక కష్ట
ములనొంది యిలుగట్ట-మొనయువారు,
బ్రతుకఁగాఁదగినంత-ఫలసాయమెఱుఁగక
సాయమ్మకై గతి-రోయువారు.

చనుడి సహకారశాఖ వి–చారణంబు
సలిపి సదుపాయముల సేయు–సత్వరముగ
దుఃఖముల వీడి సుఖముల(–దూలగలరు
రైతు సోదరులార ప–రాక దేల?

ధర్మ బద్ధంబు వా–స్తవికంబు నైనట్టి
యార్థిక సత్వమ్మ–నరయు నేది?
సర్వ రంజికమగు–సముదాయవృత్తిచే
నుత్పత్తిసేయ(గా–నోపునేది?
జాతిమత విరోధ–సంకటమ్ముల వీడి
విశ్వమానవప్రేమ–వినుచునేది?
స్వార్థంబు విడిఫల–సాయంబు ప్రజలకు
సత్యంబుగా(బంచు–సంస్థయేది?
అట్టి సహకార చైతన్య–మన్ని తెగల
మానవ హృదంతరాళంబు–లానియధిగ
మింప. హాలికవరులార–మిన్నకుండు
టేల? మున్ముందు పాల్గొని–మేలువడక.

---

ప్రభుత్వ సహకార శాఖ ప్రాధాన్యం యిటీవలగా ఎంతో పెరిగిపోయింది. ప్రతి గ్రామానికీ పంచాయతీ, పాఠశాల, సహకార సంఘం అత్యవసరమని ప్రధాని నెహ్రూ పదే పదే చెబుతున్నారు. ఇదే అమలు జరిగితే సహకార సంఘాల సంఖ్య మరీ విపరీతంగా పెరిగిపోతుంది

కేవలం కొన్ని వస్తువుల పంపిణీకి, అప్పులకే గాక సహకారం అనేది అన్ని జీవన రంగాలకూ విస్తరిస్తున్నది. భూమిని కూడ సహకార ప్రాతిపదికపై సేద్యం చేయించే ప్రతిపాదనను ప్రభుత్వం ఆమోదించింది. ఇది కొన్ని చోట్ల అమలు జరుపబడింది కూడ. ఇండ్ల నిర్మాణానికి కూడ సహకార సంఘాలేర్పడ్డాయి. పంచాయతీరాజ్ అమలు జరగడంతో ప్రతి పంచాయతీ సమితి బ్లాకులోనూ సహకార విస్తరణాధికారి నియమించబడినాడు. లోగడ జిల్లాకు ఒకరుగా ఉంటుండే డిప్యూటీ రిజిస్ట్రార్లు యిప్పుడు ఒకే జిల్లాలో ముగ్గురు, నలగురు ఉంటున్నారు.

సహకార శాఖ కార్యకలాపాలు యింతగా విస్తృతమైనా సహకార చట్టం కొంతవరకూ లోపభూయిష్టంగా ఉండటం వలన ఎన్నో యిబ్బందులు కలుగుతున్నట్లు ప్రభుత్వమే గమనించింది. పైగా, రాష్ట్రంలో యింకా ఆంధ్ర, తెలంగాణలకు ప్రత్యేక సహకార శాసనాలు కొనసాగుతున్నవి సహకార శాసనాలలోని లోపాన్ని తొలగిస్తూ ఉభయ ప్రాంతాలకు సమీకృత శాసనాన్ని నవంబర్ ప్రాంతంలో శాసనసభలో ప్రవేశపెట్టగలనని ఆర్థిక, సహకార శాఖల మంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి చెప్పారు. ఆ శాసనం రావడంతో రాష్ట్రంలో సహకారోద్యమం మరింత చురుగ్గా పురోగమించగలదని ఆశించవచ్చును.

సహకారశాఖ పథకాలకు 1961–62 సంవత్సరంలో రు. 77.93 లక్షలు, 1962–63 సంవత్సరంలో రు. 79.63 లక్షలు ప్రత్యేకించబడినవి.


"ఉదయభాను"

సహకారశాఖ కార్యకలాపాలలో గ్రామీణ పరపతి సంఘాల విస్తృతీకరణ ప్రధానమైనది. అఖిల భారత గ్రామీణ పరపతి సర్వే కమిటీ సిఫార్సులు, జాతీయాభివృద్ధి మండలి తీర్మానాల్ని దృష్టిలో పెట్టుకొని గ్రామీణ పరపతి సంఘాల్ని విస్తరింపజేయడానికి కృషి జరుగుతున్నది. ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో 584 పెద్ద తరహా సంఘాల్నీ, 1650 చిన్న తరహా సంఘాల్నీ నెలకొల్పాలని సంకల్పించబడింది. అందులో పెద్దవి 548 చిన్నవి 5547 కొత్తగా నెలకొల్పబడ్డాయి. కొత్త విధానాన్ని అనుసరించి పెద్ద పెద్ద పరపతి సంఘాల్ని ఏర్పాటు చేయడం 1–4–1959 తో ముగించబడింది. ఫలితంగా చిన్న సంఘాలు కొత్తగా ఏర్పాటు చేయబడినవి. దానితో గ్రామాలలో మొత్తం 14101 ప్రాథమిక వ్యవసాయ పరపతి (సేవా) సహకార సంఘాలు ఏర్పాటు చేయబడ్డాయి.

కొత్త సహకార విధానానికి అనుగుణంగా 1959–60 సంవత్సరంనుండీ ప్రస్తుతం ఉన్న చిన్న చిన్న సంఘాల్ని పటిష్ఠం చేసే కార్యక్రమం చేపట్టబడింది. ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘాల మొత్తం సభ్యత్వం 15.89 లక్షలకు పెరిగింది. తృతీయ ప్రణాళికా కాలంలో యీ సభ్యత్వం 40 లక్షలకు పెరుగుతుంది.

వ్యవసాయోత్పత్తికి సహకార సంఘాల స్వల్పకాలిక, మధ్యకాలిక ఋణాలుగా యిచ్చే మొత్తాలు ప్రతి ఏటా హెచ్చించబడుతున్నవి. అలాగే సెంట్రల్ సహకార బ్యాంక్, ఆంధ్ర సహకార బ్యాంక్, హైద్రాబాద్ సహకార ఎపెక్స్ బ్యాంక్‌ల మూల ధనాన్ని, వాటి సిబ్బందిని హెచ్చించ

డానికి కూడ తగు చర్యలు గైకొనబడినవి. ఒక ప్రక్క వ్యవసాయోత్పత్తిని, మరోప్రక్కన మార్కెటింగ్‌కు సంబంధం ఏర్పడడానికిగాను సెంట్రల్ బ్యాంక్‌లు, మార్కెటింగ్ సొసైటీలు, గ్రామ సహకార సంఘాల మధ్య పరిపూర్ణ సమన్వయం సాధించడానికి దశలవారీ కార్యక్రమాన్ని బ్యాంక్‌లు చేపట్టినవి.

ఇదే విధంగా భూమి తనఖా బ్యాంక్‌ల అభివృద్ధికి కూడ ఎన్నో చర్యలు గైకొనబడుతున్నవి. భూమికి శాశ్వతమైన అభివృద్ధి ఏర్పాట్లు, నీటి పారుదల సౌకర్యాలు కల్గించడానికి గాను 20 సంవత్సరాల కాలంలో తిరిగి చెల్లించడానికి వీలుగా ప్రాథమిక భూమి తనఖా బ్యాంక్‌ల ద్వారా దీర్ఘకాలిక ఋణాలు యివ్వబడుతాయి. ఇందుకోరకై ఎపెక్స్ భూమితనఖాబ్యాంక్ ఆర్థిక పరిస్థితిని మెరుగుపర్చడం జరిగింది.

ఇదిగాక సహకార మార్కెటింగ్‌ను పెంపొందించే పథకం అమలు జరుపబడుతున్నది. దీని ప్రకారం గిడ్డంగులు, విక్రయసౌకర్యాలు కల్గించడం ద్వారా సన్నకారు ఉత్పత్తిదార్లకు సహాయపడటం జరుగుతున్నది. ఉత్పత్తి సరకు హామీపై స్వల్పకాలిక ఆర్థిక సహాయం చేయబడుతుంది. ఈ పథకం క్రింద గ్రామ స్థాయిలో ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘాలు, కేంద్ర బ్యాంక్‌లు, వాటి శాఖలు, మార్కెటింగ్ సంఘాల మధ్య కార్యకలాపాలలో సన్నిహిత సమన్వయం సాధించబడుతుంది.


మన ఆర్థిక సహకార మంత్రి
శ్రీ బ్రహ్మానందరెడ్డి

మార్కెటింగ్ సంఘాలు, ఖాదీ సహకార సంఘాలు అనేక గిడ్డంగిలను నిర్మించి వ్యవసాయ ఉత్పత్తుల నిల్వకు అవకాశం కల్గిస్తున్నవి.

కేంద్ర కొబ్బరి కమిటీ రూపొందించిన ఒక పథకం క్రింద తూర్పుగోదావరి జిల్లా అమలాపురం, రాజోలు, కొత్తపేటలలో మూడు కొబ్బరి మార్కెటింగ్ సహకార సంఘాలు నెలకొల్పబడి పనిచేస్తున్నవి.

సభ్యులకు పని కల్పించే ఆశయంతో కార్మిక కంట్రాక్టు సంఘాలు నెలకొల్పబడుతున్నవి. ఈ సంఘాలకు వడ్డీ లేకుండా ఋణం యివ్వబడుతుంది. హైద్రాబాద్‌లో కార్మిక సహకార సంఘాల ఫెడరేషన్ అనేది ఉంది. ఈ సంఘానికి ప్రభుత్వ నిర్మాణపు పనులు కొన్ని యివ్వబడినవి.

అఖిల భారత గ్రామీణ పరపతి సర్వే కమిటీ సిఫార్సుల మేరకు వ్యవసాయ పరపతి నిధి నెలకొల్పబడింది. కరువు, వరదల వంటి పరిస్థితులకు లోనయి పెద్ద ఋణ భారానికి గురైన వ్యవసాయ పరపతి సహకార సంస్థలకు యీ నిధి నుండి సహాయం చేయబడుతుంది.

సహకార సేద్యాన్ని అమలుజరపాలని ప్రభుత్వం సంకల్పించింది. కౌలుదారీ సేద్య సంఘాలు, వ్యవసాయ కూలీ సంఘాలు కూడా యిందులో ఉన్నవి. కొల్లేరు సరస్సు ప్రాంతంలో భుజబాలపట్నం, తోకలపల్లిలో 2,300 ఎకరాల భూమిని 1000 మంది సభ్యులు చేరి సేద్యం చేస్తున్నారు. పశ్చిమ గోదావరి జిల్లా శంకుచక్రపురంలో కూడా సమిష్టి సేద్య సంఘం ఏర్పడింది.

మొత్తం ద్వితీయ ప్రణాళికా కాలంలో రాష్ట్రంలో 22 సహకార సేద్య సంఘాలు ప్రారంభించబడినవి. మూడవ ప్రణాళికలో 200 పైలట్ పథకాలు ప్రారంభించబడుతాయి.

అలాగే సహకార గృహ నిర్మాణ సంఘాలు యిటీవల ఎన్నో ఏర్పడి కాలనీల నిర్మాణానికి పూనుకొంటున్నవి. కేంద్ర ప్రభుత్వం, జీవిత భీమా కార్పొరేషన్ల నుండి కూడా గృహ నిర్మాణ కార్యకలాపాలకు ఋణాలు విరివిగా లభిస్తున్నవి. ఈ సౌకర్యాల్ని ప్రజలు యింకా యితోధికంగా ఉపయోగించుకోవచ్చు.

ఇన్ని విస్తృత కార్యకలాపాలలో నిమగ్నమైన సహకారశాఖ, సహకార సంఘాల సభ్యులు, కార్యనిర్వాహకులకు అఖిలభారత సహకార సంఘం ద్వారా భారత ప్రభుత్వం రూపొందించిన పథకం ద్వారా శిక్షణ గరపడానికి విస్తృతమైన ఏర్పాట్లు చేయబడినవి. సహకార శాఖ ఉద్యోగులకు కూడా రాజమండ్రి, అనంతపురం, విజయవాడ, హైద్రాబాద్‌లలో గల సంస్థల ద్వారా విస్తృత శిక్షణ గరపబడుతున్నది.

సహకార సంఘాలలోని అనధికారుల ప్రయోజనార్థం విద్యా విషయిక పర్యటనల్ని కూడ సహకార శాఖ ఏర్పాటు చేస్తున్నది. తద్వారా దేశంలోని యితర రాష్ట్రాలకు సహకార వాదులు వెళ్ళి అక్కడి సహకార వ్యవస్థను పరిశీలించడానికి అవకాశం ఏర్పడుతున్నది.

మొత్తం రాష్ట్రంలో సహకార శాఖకు ఒక రిజిస్ట్రార్, ముగ్గురు జాయింట్ రిజిస్ట్రార్లు, 105 డిప్యూటీ రిజిస్ట్రార్లు ఉన్నారు.

* * *

# సాలార్ జంగ్ మ్యూజియం

**శ్రీ యన్. రమేషన్**

హైదరాబాద్ లోని సాలార్ జంగ్ వస్తు ప్రదర్శనశాల (మ్యూజియం) ఒక్క భారతదేశంలోనే గాక విదేశాలలో గూడా ప్రసిద్ధికెక్కింది. ఇతర వస్తు ప్రదర్శన శాలలలోని ప్రాచీన కళాఖండాలను వివిధ మార్గాల ద్వారా సంవత్సరాల తరబడి సేకరించినట్లు గాక సాలార్ జంగ్ ప్రదర్శన శాలలోని వస్తువులను నవాబ్ సాలార్ జంగ్ కుటుంబం ఒక్కటే సేకరించింది. హైదరాబాద్ నగరాన్ని సందర్శించే యాత్రికులను మిక్కుటంగా ఆకర్షించే వాటిలో ఈ మ్యూజియం ఒకటి. ఇందులో అపూర్వ కళాఖండాలున్నందున భారత ప్రభుత్వం దీనిని దక్షిణ భారతదేశానికి జాతీయ వస్తు ప్రదర్శనశాలగా స్వాధీనం చేసుకున్నది. పార్లమెంటు చట్టంక్రింద ఆంధ్రప్రదేశ్ గవర్నర్ అధ్యక్షతన నెలకొల్పబడిన "సాలార్ జంగ్ మ్యూజియం బోర్డు" అనే ఒక సర్వ స్వతంత్ర సంఘం దీనిని నిర్వహిస్తున్నది.

## కీ. శే. నవాబ్ సాలార్ జంగ్ వంశచరిత్ర

నవాబ్ సాలార్ జంగ్ బహద్దూర్ గా పేరెన్నిక గన్న నవాబ్ యూసఫి అలీఖాన్, మహమ్మదీయులకు మహర్షితుల్యుడైన హజరత్ క్వాజా ఉవైస్ ఖరాని జన్మించిన ప్రాచీన వంశానికి చెందినవాడు.

నాగ్ద ప్రజలు యాత్రలకు వెళ్ళేటప్పుడు ఉడుపులు (ఇహ్రాం) ధరించే ప్రదేశాన్ని 'ఖరన్' అంటారని ప్రముఖ నిఘంటుకారుడు అల్జౌహారి వివరించాడు. కాని 'ఖరన్' అనేది ఒక ప్రదేశం కాదని, అదొక పేరని శామాని తన కితాబుల్-అన్సాబ్ లోని 449 వ పేజీలో పేర్కొన్నాడు.

తుజ్కైరాతుల్ ఆలియా రచయిత షేక్ ఫరీదుద్దీన్, తరీఖ్-ఇ-రౌజాతుల్ కూడా "ఖరన్" అనేది ఏడెన్ ముఖ్య దుర్గంగా గల యామన్ లో ఒక గ్రామమని తెలిపారు. "ఖరన్" అనేది ఒక వంశాధిపతికి ఇచ్చిన బిరుదు కూడా ఐ వుండవచ్చునన్న అభిప్రాయాన్ని కూడా వీరు సమర్థిస్తున్నారు.

దీని నిజానిజాలు ఏవైనా "ఖరన్" ఒక వంశాధిపతి బిరుదు అనడానికి అవకాశమున్నా "ఖరన్" యమాన్ లో ఒకప్పుడున్న గ్రామం అని భావించడం అని అసమంజసం కాదు. నాల్గవ ఖలీఫా యైన హజరత్ అలీ ఇబన్-తలీబ్, సిఫిన్* పైకి దండయాత్రకు వెడుతుండగా హజరత్ ఉవైస్ కూడా ఆయన వెంటవెళ్ళి సంగ్రామంలో మృతిచెంది మృతవీరుడయ్యాడు

హజరత్ ఉవైస్ వంశస్థులలో రెండవ షేక్ ఉవైస్, మూడవ షేక్ ఉవైస్ అనే ఇరువురు షేక్ లు వున్నట్లు హదిఖతుల్-ఆలం, నిజాముల్-అన్సాబ్ వంటి ప్రామాణిక చరిత్రల లోను, మాసే-రుల్-ఉమ్రాలలోను వివరించబడివున్నది క్రీ. శ. 1656 వ సంవత్సరంలో మూడవ షేక్ ఉవైస్ మదీనా నుంచి భారత దేశానికి వలసవచ్చి కొంకణ తీరం చేరుకుని రెండవ అలీ ఆదిల్ షా పాలనలో బీజాపూర్ ఆస్థానంలో ప్రవేశించాడు.

రాజు ఆ మహర్షితుల్యుడిని అత్యంత గౌరవంతో ఆదరించి ఆయన కుమారుడైన మహమ్మద్ అలీని 'దబిర్' అనే ఒక ముఖ్యపదవిలో నియమించాడు. అతని తనయుడైన మహమ్మద్ బాఖర్ "మీర్ సమాని"గా నియమితుడై సికిందర్ ఆదిల్ షా పాలనవరకు అదే పదవిలో వున్నాడు. ప్రధానమంత్రియైన

---

* యూఫ్రేటస్ నది కుడి ఒడ్డుపైన, రఖ్ఖాహాకు అభిముఖోర్ధ్వంగా 'సిఫిన్' ప్రాంతం వున్నదని, ఇద్దరు ఖలీఫాలైన మావియా, హజరత్ ఆలీలకు పంపిణీల విషయంలో ఇక్కడ యుద్ధం జరిగిందని లే-స్ట్రేంజి (Le-Strange) "ది ల్యాండ్ ఆఫ్ ది ఈస్టర్న్ కాలిఫేట్" (The land of the Eastern Caliphate) అనే గ్రంథంలో పేర్కొన్నారు.

ముస్తఫాఖాన్‌తో కొన్ని అభిప్రాయభేదాలు వచ్చి మహమ్మద్ బఖార్ తన పదవికి రాజీనామా ఇచ్చి, మొఘల్ చక్రవర్తి ఐన ఔరంగజేబును ఆశ్రయించడానికి ఢిల్లీవెళ్ళగా, చక్రవర్తి ఆయనకు మన్సబ్-దో-హజారీ ఇచ్చి సత్కరించాడు అప్పుడు ఉత్తర భారతదేశంలోని పరిస్థితులాయనతో ఏకీభవించినందున ఆయన విజ్ఞప్తిని పురస్కరించుకొని చక్రవర్తి ఆయనను బీజాపూర్, అహమ్మద్ నగర్‌లకు రాయబారిగా పంపాడు కొంతకాలం తర్వాత ఆ పదవికి కూడా రాజీనామా ఇచ్చి ఔరంగాబాద్‌లో స్థిరపడి తన జాగీర్‌లో వచ్చే ఆదాయంతో ప్రశాంతంగా జీవించాడు.

అతని కొడుకైన షేక్ మహమ్మద్ తఖ్వీ ఔరంగజేబుచే మన్సబ్‌గా సత్కరింపబడి ఫరుఖ్‌సియార్ పాలనలో దారోగా జజియా అనే మరొక ఉన్నత పదవిలో నియమింపబడ్డాడు ఆయన మొదటి అసఫ్‌జా పాలనలో దక్కన్ దుర్గాలకు అధిపతి అయినాడు. ఆయన పుత్రుడైన షమ్సుద్దీన్ ప్రథమంగా గజదళానికి ముఖ్య సేనాధిపతియై తన శక్తిసామర్థ్యాలతో ఆరాజ్-బెగి పదవి వరకు వెళ్ళాడు. షమ్సుద్దీన్ సేవాసక్తికి ఆసఫ్-జా సంతోషించి అతనికి షేర్‌జంగ్, మునిరుద్దౌలా, మునీరుల్-ముల్క్ అనే బిరుదులనిచ్చాడు. అతని కొడుకైన మహమ్మద్ సఫ్దర్ ఖాన్‌కు ఘయూర్‌జంగ్ అనే బిరుదువుంది ఇతను సలబత్‌జంగ్ పాలనలో కోత్వాల్‌గా (ఇప్పటి పోలీస్ కమిషనర్) వుండి తను చేసిన సేవకు ఖాన్‌ఖానా అనే బిరుదు పొందాడు. అతని రెండవ కొడుకైన అలీ జమాన్ ఖాన్ కళారాధకుడు. సాహితీప్రియుడు. రెండవ ఆసఫ్‌జా ఆయనకు ఇదివరకతని తాత గారు పొందిన మునీరుద్దౌలా, మునీరుల్-ముల్క్ బిరుదులనేగాక అమీర్-ఉల్-ఉమ్రా అనే మరొక పెద్ద బిరుదునిచ్చి సమ్మానించాడు ప్రధాని మంత్రియైన అరస్తూజా దండయాత్రకై పూనా వెళ్ళగా ఆ పరిపాలనా బాధ్యతలను అసఫ్‌జా, మునీరుల్ ముల్క్‌కు అప్పగించగా వాటిని ఎంతో శక్తి సామర్థ్యాలతో నిర్వహించాడు. దక్కను చరిత్రలో అనేక ధర్మ కార్యాలకు, దాతృత్వానికి ప్రఖ్యాతి గాంచిన మీర్ ఆలం బహద్దూరు కుమార్తె ఐన నఫీసా బేగంను ఆలీ జమాన్‌ఖాన్ వివాహమాడాడు. ఆమె మరణాంతరం మీర్ ఆలం మరొక కూతురైన సాహెబా బేగంను చేసుకొనగా వీరిరువురికి నవాబ్ మీర్ మహమ్మద్ ఆలీఖాన్ జన్మించాడు. ఈయనే కీ. శే. నవాబ్ సాలార్‌జంగ్ తాత. మీర్ ఆలం మరణాంతరం ఆలీ జమాన్‌ఖాన్ దక్కన్ మొత్తానికి ప్రధానియై ఆ పదవిలో 25 సంవత్సరాలపాటు వున్నాడు. జమాన్‌ఖాన్ కొడుకైన మీర్ మహమ్మద్ అలీఖాన్ (ఇతనికి కూడా సాలార్‌జంగ్ షూజా ఉద్దౌలా అనే బిరుదువుంది.) 25 సంవత్సరాల యుక్త వయస్సులోనే చనిపోయాడు. ఇతని పుత్రుడైన తురబ్ ఆలీఖాన్ తాతగారైన ఆలీ జమాన్‌ఖాన్ సంరక్షణక్రింద పెరిగి యుక్త వయస్సులోనే నవాబ్ నసీరుద్దౌలా పాలనలో ప్రధాని అయినాడు అల్లకల్లోలంతో అరాచరికం తలఎత్తిన ఆ రోజులలో అతను ఎన్నో పరిపాలనా సంస్కరణలను ప్రవేశపెట్టాడు అతడు నవాబ్ అఫ్జరుద్దౌలా హయాములో కూడా ప్రధానిగా వుండి ఇప్పటి నైజాం నవాబ్ తండ్రి ఐన నవాబ్ మీర్ మహబూబ్ అలీఖాన్ పాలనలోకూడా కొంతకాలం పాటు ఆ పదవినే ఎంతో ప్రతిభతో నిర్వహించాడు. అతని మరణానంతరం కొడుకైన లాయఖలీ ఖాన్, మనవడైన నవాబ్ సాలార్‌జంగ్ బహదూర్‌లు హైదరాబాద్ రాష్ట్రానికి ప్రధాన మంత్రులయ్యారు.

నవాబ్ సాలార్‌జంగ్ పూర్వీకులలో ఒకడైన నవాబ్ ఘయూర్‌జంగ్, దుర్గాఖులీఖాన్ కూతురైన ఖైరున్నీసాబేగంను చేసుకోవడం. ఈ దుర్గాజలీఖాన్‌కు కూడా సాలార్‌జంగ్ బిరుదు వుండడం గమనింపదగిన విషయం. నాదిర్‌షా దండయాత్రలప్పుడు దుర్గాఖులీఖాన్ మొదటి అసఫ్‌జా వెంట ఢిల్లీ వెళ్ళిన విషయం అప్రధానంగా ఇక్కడ తెలపవచ్చు. అతని కొడుకైన నవాబ్ ఇనాం ఆలీఖాన్‌కు కూడా సాలార్‌జంగ్ బిరుదు వున్నది. కనుక కీ శే. నవాబ్ యూసఫ్ ఆలీఖాన్ ఆరవ సాలార్‌జంగ్-ఎందుకంటే అతనికి ముందువున్న దుర్గాఖులీఖాన్, ఇతని కొడుకు ఇనాంఖులీఖాన్‌లతో సహా అతని కుటుంబంలోని నలుగురికి సాలార్‌జంగ్ బిరుదు వున్నట్టు వంశ వృక్షం తెలుపుతున్నది మీర్ఆలం చనిపోయిన తరువాత ఆయన అల్లుడూ. నవాబ్ యూసఫ్‌ఖాన్ తాతయైన నవాబ్ అలీజమాన్ ఖాన్ హైదరాబాద్‌కు ప్రధాన మంత్రి అయ్యాడు. అప్పటినుంచి అతని కుటుంబంలోని వారే వంశ పారంపర్యానుగుణంగా ఆ పదవిలోనే వుంటూ వచ్చారు.

కనుక సాలార్‌జంగ్ బిరుదు, ప్రధాన మంత్రి పదవి కూడా ఆయన కుటుంబంలో తల్లి వంశం నుంచి కొనసాగుతూ వచ్చిందని తెలుస్తున్నది.

కీ శే. నవాబ్ సర్ సాలార్‌జంగ్ వంశావళిని పరిశీలిస్తే ఆ వంశంలోని వారందరూ దక్కను చరిత్రలో ప్రముఖ పాత్ర వహించి తమ సేవాభిలాషతోను, శక్తి సామర్థ్యాలతోను దేశ

భవితవ్యాన్ని తీర్చిదిద్దినట్టు తెలుస్తుంది. కీర్తిశేషుడైన నవాబ్ సాలార్‌జంగ్ బహదుర్ వంశావళి ఈ దిగువ ఇవ్వబడింది.

### కీ. శే. నవాబ్ సాలార్‌జంగ్ వంశావళి




### మ్యూజియం పుట్టు పూర్వోత్తరాలు: అభివృద్ధి

నవాబ్ సాలార్‌జంగ్ గొప్ప కళారాధకుడు. ఏ కళాఖండం లోని ప్రతిభనైనా ఇట్టే సంపూర్ణంగా గ్రహించగల కళాహృదయుడు. ప్రపంచమంతటా వున్న అమూల్యమైన కళాఖండికలను హైదరాబాద్‌లో ఒక ప్రదర్శనశాలలో వుంచి దాన్నొక విజ్ఞాన కేంద్రంగా రూపొందించాలని నవాబ్ మహత్తరాశయం. ఈ దృష్టితోనే చారిత్రక ప్రాముఖ్యత, కళా సంపద ఉట్టిపడే వస్తువులను కొనడానికి ఆయన కాలాన్ని, ధనాన్ని కూడా వెచ్చించాడు. అమూల్యమైన వస్తు సంచయాన్ని హైదరాబాద్‌లోని ఒక మ్యూజియంలో వుంచి వాటిని ప్రపంచంలోని పండితులకు, కళారాధకులకు ఉపయోగార్థం సక్రమంగా ప్రదర్శించాలని ఆయన కలలుకన్నాడు. ఈ మ్యూజియంలో పూర్వీకుల నుంచి వస్తున్న వంశధనం వున్నప్పటికీ, నవాబ్ యూసఫ్ అలీఖాన్ ఆరవ సాలార్‌జంగ్ ఎంతో శ్రమపడడానికి పైన తెలిపిన ఆశయమే ఈ మ్యూజియం ఏర్పడడానికి పునాది

కాని తను కన్న కలలు ఒక రూపానికి రాకముందే దురదృష్ట వశాత్తు నవాబ్ 1949 వ సంవత్సరంలో తనువు చాలించాడు అప్పటి హైదరాబాద్ రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ యం. కె. వెల్లోడి ఐ.సి.యస్. ఎంతో శ్రద్ధ తీసుకున్న ఫలితంగా, ప్రస్తుత గుజరాత్ గవర్నర్ నవాబ్ మెహిదీనవాజ్‌జంగ్ అధ్యక్షతన ఒక ఎస్టేట్ కమిటి ఏర్పడింది. ఇంత ఎస్టేటును పునర్వ్యవస్థీకరించి, దానిని ఎంతో అభివృద్ధి చేసి, ఆ అమూల్య ప్రాచీన కళా సంచయాన్ని భద్రంగా వుంచిన నవాబ్ సాహెబ్‌కు దేశం ఎప్పుడూ కృతజ్ఞురాలై వుంటుంది. వివిధ ప్రాంతాలలో డజన్లకొద్దీ గదులలో చెల్లాచెదురుగా వున్న ఈ అమూల్య వస్తువులను సక్రమంగా ఏర్పాటు చేయడానికి శ్రీ జి. వెంకటాచలంను ఎస్టేట్ కమిటీ ఆహ్వానించింది.

ప్రాచీన మొఘల్ కట్టడాల శైలిలో నిర్మింపబడిన నవాబ్ పాత ప్రసాదమైన దివాన్‌దేవిడీ లోను, దాని ప్రక్కనే నయా మకాన్ పేరుతో వున్న ఆధునిక భవనాల్లోను ఈ వస్తుప్రదర్శనశాలను ఏర్పాటు చేశారు. ఈ భవనాలను పూర్తిగా బాగు చేయించి చైనా, జపాన్, పర్షియా, టర్కీ, బర్మా మొదలైన దేశాల నుంచి సేకరించిన వస్తు సమూహాన్ని కన్నుల పండువగా ఏర్పాటు చేశారు.

## సాలార్‌జంగ్ మ్యూజియం విభాగాలు

### 1. ప్రాచ్య విభాగం

ఈ మ్యూజియం ప్రాచ్య విభాగాన్ని 30 కి పైగా చిన్న గదులలో ఏర్పాటు చేశారు. ఈ విభాగంలో బిద్రీ పాత్రలు, టిబెట్ లోహపు వస్తువులు, మలబార్, మధురల కొయ్య చెక్కడాలు, దక్షిణ హిందూ దేశపు కంచు విగ్రహాలు, చైనా పింగాణీ పాత్రలు, జపాన్ లక్క పాత్రలు, పర్షియా తివాచీలు, కాశ్మీర్ శాలువలు, బంగారు జరీతో చేసిన మస్నాద్‌లు, చిన్న పరిమాణం

లోని మొఘల్ చిత్రాలు (Miniatures) రాజపుత్రస్థాన్, దక్కన్‌ల చిత్రాలు, ఇంకా ఆధునిక భారతీయ చిత్రకారుల చిత్రాలు ఉన్నాయి. ఒకప్పుడు నూర్జహాన్‌కు చెందిన పచ్చలు, కెంపులు పొదిగిన బాకు, వజ్రాలు, పచ్చలు, కెంపులు, పొదిగిన జహంగీర్ బాకు, షాజహాన్ ఎనామిల్ కటారు, "ఘద్ కలీద్ ముమాలిక్-ఖంజర్ బాదుషా ఆలంఘీర్" అనే పర్షియా ద్విపద పద్యం లిఖింపబడివున్న ఔరంగజేబు నవరత్న ఖచితమైబాకు, తానాషా ఆభరణాల ఖడ్గం, జహంగీర్, షాజహాన్‌లు కొన్ని పంక్తులు వ్రాసిన యాఖుత్ ఖరాను, బెహజాద్ కళా ఖండాలు, అందాలొలికే ఇమాద్ దస్తూరి, జహంగీర్ వాడిన మధు పాత్రలతో పాటు మొఘల్ ఎనామిల్ వస్తువులు, అపూర్వమైన కొన్ని నవ రత్న ఖచిత వస్తువులతో భారతీయ విభాగం అలరారుతుంది అక్కడవున్న రమణీయమైన కొన్ని పర్షియా, పట్టు తివాచీలు, బంగారు దారంతో తయారుచేసినతివాచీలు, బంగారు మస్నాదులు, 24అడుగుల పొడవుగల బంగారువస్త్రం, దంతపు తివాచీ చూపరుల కళ్ళకు మిరుమిట్లు గొల్పి ఆశ్చర్య చకితులను జేస్తాయి. దక్కను గదిలో బ్రహ్మాండమైన చిత్రాలతో పాటు నిజామ్ అలీఖాన్ వేటాడు తున్నట్లు చిత్రీకరించిన రెండు పెద్ద చిత్రాలు వున్నాయి. వీటిని నిజాం ఆస్థాన చిత్రకారుడైన శ్రీ కె. వెంకటాచలం చిత్రించారు. కొన్ని ప్రాచీన బిద్రీ పాత్రలు, నిర్మల్, బైగనపల్లిల లక్క కుర్చీలు, బల్లలు, మొదలైనవి, చాందినీలు, వరంగల్ తివాచీలు కూడా పేర్కొనదగినవే!

కొయ్యతో చెక్కిన మధురరాతి మంటపం నమూన, హిందూ దేవతల బొమ్మలున్న చాందినీ తెర, పంకా, డచ్‌కి చెందిన పురాతన కుర్చీలు, టీపాయ్‌లు, పెద్ద కుర్చీలు, తెరలు మొదలైన వాటిని భారతీయ విభాగపు మొదటి భాగంలో అందంగా అమర్చారు.

బర్మా కొయ్య చెక్కడాలను, టర్కీ, ఈజిప్ట్, భారత దేశాల కుర్చీలు, మేజాలు మొదలైన వాటిని, ప్రాచ్య అల్లిక వస్తువులు, అందమైన దస్తూరీలు వున్న పటాలు మొదలైన వాటిని ఒక గదిలో వుంచారు. చిన్న అద్దాల గదిలోని క్రింద విభాగంలో రంగురంగుల దీపపు సెమ్మెలు, డెమాస్కస్ ఫర్నీచర్ వున్నాయి. వివిధ తరగతులుగా అమర్చి వున్న ఇటలీ పాలరాతి కళా ఖండాలు, క్రీ.శ. 1876 లో బెంజోని చెక్కిన "మేలి ముసుగులో రెబెకా" అనే శిల్పం ఒక పెద్ద అద్దాల గదిలో కనిపిస్తాయి. ఇవి ఇటలీ కళలో అత్యుత్తమమైనది. తెల్లని దీపపు సెమ్మెలు ఆ హాలు సౌందర్యాన్ని మరింతగా ఇనుమడింప చేస్తాయి. ఒక ఇటలీ శిల్పి కొయ్యతో చెక్కిన మెఫిస్టోఫిలెస్-మార్గారెట్టా విగ్రహం కూడా అక్కడే వున్నది. కళాహృదయులను ఈ విగ్రహం శివపార్వతుల మిశ్రమరూపమైన అర్ధనారీశ్వర రూపాన్ని జ్ఞప్తికి తెస్తుంది.

### 2. దక్షిణ భారత దేశపు కంచు విగ్రహాలు

ఈ మ్యూజియంలో దక్షిణ భారతదేశానికి చెందిన గణేశ, బాలకృష్ణ, శివుడు, పార్వతి, విష్ణుమూర్తి,లక్ష్మి మొదలైనదేవతల కంచు విగ్రహాలు కొన్నే వున్నా ఇవి అత్యద్భుతమైనవని కాదన లేము. వీటిలోవున్న సోమస్కంద, నటరాజ విగ్రహాలలో అపూర్వ కళా సౌందర్యం వుట్టిపడుతుంటుంది. ఒక పీఠంపై కుడివైపున శివుడు ఆసీనుడై వుంటాడు. ఎడమ వైపున ఉమకూర్చుని వుంటుంది, స్కందుడు పసిపాప రూపంలో ఈ ఆది దంపతు లిరువురి మధ్యన వుంటాడు. ఈ విధంగా వుండే సోమస్కంద విగ్రహాన్ని రూపొందించిన శైలిప ల్లవ శిల్పాలలోను, మధ్యయుగపు కంచు విగ్రహాలలోను గోచరిస్తుంది. క్రీ.శ. 12-14 శతాబ్దాల మధ్యదైన నటరాజు కంచు విగ్రహంలో శివుడు తాండవమూర్తిగా నృత్యం చేస్తుంటాడు. ఆయన కేశాలు గాలిలో ఎగురుతుంటాయి ఆయన వివిధ హస్తాలలో డమరుకం, సర్పం మొదలైనవి వుంటాయి. అంధకారం, అసత్యాలపై, వెలుతురు, సత్యం సాధించిన విజయాన్ని సూచిస్తూ అపస్మారభూతం వీపుపై నిల్చుని శివుడు నృత్యం చేస్తూంటాడు. ఆదిదేవుని పాదాలే భక్తులకు మోక్షం కలిగిస్తాయని సూచిస్తున్నట్లు శివుడు తాను ఎత్తిన ఒక పాదాన్ని వేలితో చూపుతూ కుంచితపాద భంగిమలో వుంటాడు.

### 3. చిత్రశాల

చుగ్‌తాయ్, డి పి రాయ్ చౌదరి, టాగోర్ సోదరుల వంటి ఆధునిక చిత్రకారుల ఆధునిక, సమకాలీన కళాఖండలెన్నో వున్నాయి. శారదా ఉకిల్ ఒక బౌద్ధ ఇతివృత్తాన్ని పట్టు వస్త్రంపై చిత్రించాడు. సుకుమార్ దేవుస్కర్ వేసిన గోల్కొండ బీజాపూర్ రాజుల చిత్రాల ప్రతులు, ఇంకా ఇతర ఆధునిక కళాకారుల చిత్తరువులు కూడా ఉత్సాహం కలిగిస్తుంటాయి. ఇంకా మొఘల్ చిత్తరువులు (Miniatures) ప్రఖ్యాత కళాకారుడు బెహజాద్ చైనా సిరాతో వేసిన బొమ్మలు, దంతంపై వేసిన ఔరంగజేబు చిత్రం, మొఘల్ రాకుమారులు, రాకుమార్తెల చిత్రాలు కూడా ఇక్కడ వున్నాయి.

4. చైనా, జాపానీల వస్తువులు.

ఈ మ్యూజియం తూర్పు విభాగంలోని మొదటి భాగంలోని రెండు పెద్దగదులలో చైనా, జపాన్‌ల వస్తుసముదాయం వున్నది వీటిలో జపాన్‌కు చెందిన నిక్కో పర్నిచర్, పట్టు అల్లిక తెరలు వున్నాయి. రెండు పగోడాలు, దంతపు చెక్కడాలు, లక్కబీరు వాలు, కర్పూరపు అలమరలు, రత్నాలు పొదిగిన చాందినీలు పాలవన్నెలో వుండే కొన్ని ప్రాచీన సత్సుమా పాత్రలు, అందమైన చిత్రాలు చెక్కిన దంతపు ఒరలలోని శాముర్రై ఖడ్గాలు ఇందులో ఎక్కువ ఆకర్షించే అమూల్య ఖండాలు. చైనా వస్తువుల గదిలో అందాలొలికే పింగాణీ వస్తువులు, మింగ్ కాలంనాటి దంతపు వస్తువులు, పెక్కు సాంప్రదాయికమైనచిత్రాలువున్నాయి ఇందులో ముఖ్యంగా పేర్కొన గింది-దీర్ఘాయుష్ దేవతయైన "షాన్-షింగ్" విగ్రహం. ఈ గదిలోనే మి-లై అనే రెండు బుద్ధవిగ్రహాలు నవ్వుతున్నట్టుగా వుంటాయి. చైనాలోని బౌద్ధదేవ శాలలో ప్రథమ ద్వారం వద్ద సంతోష సౌభాగ్యాలకు నిదర్శనంగా ఇవి కనిపిస్తుంటాయి. ఈ కళాఖండాలు అజంతా హాలు మొదలైన గుహాలయాలలో కుబేరుని నిధులుగా మలచబడివున్న శంక నిధి, పద్మనిధులకు ప్రతిరూపాలుగా గోచరించడమేగాక, వాటిని చూస్తుంటే కాళిదాసు తన "మేఘదూత"లో వ్రాసిన ఈ క్రింది పంక్తులు జ్ఞప్తికి వస్తాయి

ఏభిస్సాధో హృదయనిహితై
  ర్లక్షణై ర్లక్షయేథా
ద్వారో పాన్తే లిఖితవపుషౌ
  శంఖపద్మౌచ దృష్ట్వా
  (మేఘసం-ఉత్తరభాగం-19 శ్లో)

భయంకరమైన మొసలి, దీర్ఘజీవితానికి సౌభాగ్యానికి నిలయమైన ఒక పౌరాణికపక్షి, పవిత్రతకు నిలయమైన ఒక బొమ్మ మొదలైనవి చూపరులకాశ్చర్యాన్ని కలిగిస్తాయి. పైన తెలిపిన భయంకరమైన మొసలిబొమ్మ ప్రాచీన చైనా జాతీయ పతాక చిహ్నం దీనితోపాటు వర్షాలు వరదలు, కరువులు మొదలైన ఈతి బాధలు వున్నాయి మొత్తంమీద ఇది ఒక దివ్యజంతువు.

కుడిచేత పద్మాన్ని, ఎడమచేత కమండలాన్ని కొద్దిగా ప్రక్కకువంచి పట్టుకొనివున్న అవలోకితేశ్వర లేక పద్మపాణి అనబడే క్వాన్ ఇన్ కంచువిగ్రహం మరొక అపూర్వ కళాఖండం. ఈ అవలోకితేశ్వరుని చేతులో మామూలు అవలోకితేశ్వర ప్రతిమలలో వలె పద్మాలు గాక — ఒకే పద్మం వుంది. ఈ విగ్రహం సాధనమాలలో వివరించిన బౌద్ధ చిత్రాల శైలిలో వుండదు అదీగాక ఈ అవలోకితేశ్వరుని ఉష్ణీషంలో అంకితథ (అతని ఆధ్యాత్మికపిత) చిత్రంలేదు అయినా పైన తెలిపిన అన్ని లక్షణాలతో మరొక క్వాన్‌యిన్ ప్రతిమ కూడా ఈ ప్రదర్శనశాలలో వుంది. బోధి సత్త్వుడు కుడిచేత పద్మాలను ఎడమచేత కమండలును ధరించి మైత్రేయుడుగా మలచబడి వున్నాడు ఈ మైత్రేయుడే ప్రస్తుతం తుషిత స్వర్గంలో వున్న భావి బుద్ధుడు.

5. పాశ్చాత్య చిత్రాలు, గృహోపకరణ వస్తువులు, ఇంకా ఇతర వస్తుసముదాయం.

ఈ విభాగంలో పాశ్చాత్య తైలవర్ణచిత్రాలు కొన్నివున్నాయి. లాండ్సీర్ చిత్రించిన "రాత్రికాపలాదారు"వాట్స్ వేసిన "ఆర్ఫియట్ యూరిడైస్", లైటన్ వేసిన "థీసియస్‌చే పరిత్యజింపబడిన ఎరియాడ్ని", పాస్టర్ "టౌలిణ", కూపర్, "విశ్రమించిన పశువులు" కెన్నాలెట్టో వేసిన "పియాజా శాన్ మార్కో", కాన్‌స్టేబిల్ వేసిన రెండు నైసర్గిక చిత్రాలు, ఇంకా డచ్చి, ఇంగ్లండు ఇటలీ, అమెరికా దేశాల ప్రముఖ కళాకారులు వేసిన చిత్రాలు ఇక్కడ ఎన్నో వున్నాయి. ఇటలీపునరుద్ధరణ (Renaissance) కాలంలో మహనీయులైన రూబెన్స్, రాఫెల్, బొట్టిసెల్లి, వెలాస్క్వెజ్, టిటియన్, లియోనార్డో-డా-విన్సీల చిత్రాల ప్రతులు కళా హృదయులకు కన్నులపండుగ చేస్తాయి. ఇక్కడేవున్న రెండు తైలవర్ణ చిత్రాలలో మాంటెగేన్ వేసిన " విషం త్రాగుతున్న అబేలా " అనే చిత్రం ప్రశంశనీయమైంది ప్రముఖ ఇటలీ నవలా రచయిత చాటూబ్రియన్ వ్రాసిన నవలలోని ఒకగాధను ఇతివృత్తంగా తీసుకొని వేయించబడక్కు శ్రమించి చిత్రించిన ఈ కళాఖండంలోని వర్ణ సమ్మేళనం ఎంతో ప్రశంశనీయంగా వుంటుంది. రెండవ తైలవర్ణ చిత్రం ప్రముఖ చిత్రకారుడు వాండెర్ హైమెన్ వేసిన " స్వామి అసురపూజ"

మరొక గదిలో కొయ్య పాత్రలు, క్రీ. శ. 18వ శతాబ్దిన థామస్ షేరటణ రూపొందించిన గృహోపకరణ వస్తువులు, ఎంతో అందంగా అమర్చబడి, కళాకౌశలం ఉట్టిపడేఖడ్గాలు, బాకుల సముదాయం కనిపిస్తాయి. నవాబ్ సాలార్‌జంగ్ సేకరించిన గృహోపకరణ సామగ్రి నాణ్యతలో వాటికవేసాటి. వీటిలో పేర్కొనదగినవి 14 వ లూయీచక్రవర్తి, 15 వ లూయీ చక్రవర్తుల దుస్తులు, ఫ్రాన్స్‌కు చెందిన 16 వ లూయీ చక్రవర్తి భార్యయైన మేరీ ఆంటో నెట్టే అలంకరణబల్ల యానీరాణి, షార్టన్, చిప్పేండిల్, హెప్పల్ వైట్, ప్రాచీన విక్టోరియా రీతికి చెందిన వస్తువులు ఇక్కడవున్న కొన్ని సెవ్రేపింగాణి పాత్ర

లపై ఆట దృశ్యాలు చిత్రింపబడి వుండటమే గాక వాటిపై చిత్రకారుల సంతకాలు కూడావున్నాయి. రష్యాకుచెందిన కేథరిశాగాణి ఉపయోగించిన రెండు సెవ్రే పాత్రలు కళా సౌందర్యం దృష్ట్యా చెప్పుకోదగ్గవి. వీటిని 15 వ లూయీ చక్రవర్తి టిప్పుసుల్తాన్‌కు బహూకరించాడట. క్రీ. శ. 1799వ సంవత్సరంలో జరిగిన నాల్గవ మైసూర్ యుద్ధంలో టిప్పుసుల్తాన్ పతనానంతరం జరిగిన దోపిడీలో ఇవి నవాబ్ సాలార్‌జంగ్ తాతకు లభ్యమైనవట.

ఇక్కడవున్న గడియారాలు, దీపపు దివ్వెలు, పాత్రలు, పెద్దపెద్ద పలపాత్రలు ఎంతో బావుంటాయి. ఇక్కడి అలంకరణ బల్లలు, అలమరాలు కూడా సుందరమైనవే!

గాజుతో తయారైన ఒక ఇంగ్లండు అలమరలో నీటి బుడగల బొమ్మలు, బైల్వీ పానపాత్రలు, ఖండాంతరపు గాజుతో తయారైన రెండు పెద్ద అలమరలు కూడా అపూర్వ సేకరణాలే!

ఒకశాలలో ప్రపంచంలోని తత్వవేత్తల, నాయకుల ప్లాస్టర్ విగ్రహాలు (రొమ్మువరకు) వున్నాయి.

సిపాయి బొమ్మలు, చిన్నరైళ్లు, చిత్ర విచిత్రమైన బొమ్మలు బాలలకు ఎంతో ఉత్సాహాన్ని కలిగిస్తాయి.

6. మ్యూజియం లిఖిత ప్రతులు.

ఈ ప్రదర్శనశాలలోవున్న అమూల్యాభరణాలు, తివాచీలు, శాలువలు, చిత్రాలు, చెక్కడాలు, ఇంకా ఇతర కళాఖండాలు అందరికీ తెలుసుగాని నవాబ్ సాలార్‌జంగ్ ప్రాచ్యగ్రంథాలయంలోని పాత బీరువాలలో వున్న సాహితీ సంపద కొందరికి మాత్రమే తెలుసు. తూర్పు దేశాలన్నిటిలోని గొప్ప గ్రంథాలయాలలో ఎక్కడాలేని అమూల్య లిఖిత ప్రతులున్నాయి. ఇక్కడ వున్న 30 వేల గ్రంథాలలోను 2459 గ్రంథాలు అరబ్ భాషలోను, 4,146 గ్రంథాలు పర్షియా భాషలోను వున్నాయి. పరిశోధన చేసే పండితుల ఉపయోగార్థమై ఇంత సాహిత్య సంపదను సమకూర్చిన నవాబ్ సాలార్‌జంగ్ ప్రతిభకు ఈ గ్రంథాలయమే ఒక తార్కాణం. యూరోపు, అమెరికా, మధ్యప్రాచ్యదేశాలలోని ప్రాచ్యలిఖిత గ్రంథాలయాల తర్వాత చెప్పుకోదగింది సాలార్‌జంగ్ ప్రదర్శనశాలలోని లిఖిత ప్రతుల గ్రంథాలయమని అంతగా ఎవరికీ తెలీదు. అంతేగాక బాంక్‌పూర్‌లోని ఖుదబక్ష్ గ్రంథాలయం, బెల్‌వెడేర్‌లోని జాతీయ గ్రంథాలయం, కలకత్తాలోని ఆసియా గ్రంథాలయం హైదరాబాద్‌లోని ఆసఫియా గ్రంథాలయం మొదలైన వాటిల్లో అరబ్, పర్షియా, ఇతర భారతీయ భాషలలోవున్న లిఖిత గ్రంథాలకు సాలార్‌జంగ్ ప్రదర్శనశాలలోని లిఖిత గ్రంథాలు సహాయకారిగా వుంటాయి. ఆసియా దేశాలలోని ప్రాచీన గ్రంథాలు, ప్రముఖ తత్వవేత్తల రచనలు వివిధ శైలులకు, విజ్ఞాన కేంద్రాలకు చెందిన లిఖిత ప్రతులు, వీటిలో వున్నాయి. తత్వశాస్త్రం, తర్కశాస్త్రం, ఇస్లామ్ మతం, ఖురాను, ఖురాను వాఖ్యానాలు, న్యాయశాస్త్రం, చట్టాలు, పురాణాలు, సాహిత్యం, భాషాశాస్త్రం, గణితశాస్త్రం, ఖగోళశాస్త్రం, జ్యోతిశ్శాస్త్రం, వైద్యశాస్త్రం, చరిత్ర, భూగోళం మొదలైన అనేక విషయాలకు సంబంధించిన లిఖిత ప్రతులు వున్నాయి. వీటిపై అట్టలు ఎంతో అందంగా వుండడమేగాక, కుఫిక్, సెమి-కుఫిక్ నాష్క్, తుల్త్, నాస్తాలిక్, రిక్వీ, మహఖ్యాక్, రైహాన్, ఘుబర్, తలిక్, షికిస్తా మొదలైన వాటికి చెందిన వివిధ రకాల లిపి ఈ గ్రంథాలలో ప్రతిబింబిస్తూవుంటుంది.

ఈ లిఖిత ప్రతుల సముదాయంలోని లేఖకులలో యాఖుత్ ముస్తాసిమి, ముబారక్‌షా, షామిస్కీన్, అబ్దుల్లా మార్వారిద్, అబ్దుల్ హై, మార్ఘినాని, జైనుబాన్, ఇబ్రాహీమ్‌కి, మహమ్మద్ అమీన్, గోల్కొండకు చెందిన ఖుతుబ్‌షా, బీజాపూర్‌కు చెందిన ఇబ్రహీం ఆదిల్‌షా, ఔరంగజేబు చక్రవర్తి కూడా వున్నారు. అల్లామాల్-హిల్లి, ముల్లా సద్రా, ముల్లాబజీర్ అల్-దామద్, అఖం హుస్యాన్ ఖ్వానసారి, మీర్జా జన్ హబీబుల్లా, షిరాజిమీర్ సయ్యద్ షరీఫ్ జార్జని బుహాన్ ఉద్దం, రైస్కి, నసీరుద్దీన్ తుసి, మొరక్ అందాల్ జైబునీల ప్రాచీన ప్రతులు, వ్యాఖ్యలు ఇంకా పెక్కు తత్వ శాస్త్ర ప్రామాణిక గ్రంథాలను సేకరించడంలో నవాబ్ సాలార్‌జంగ్ ఎన్ని కష్టాలనైనా లక్ష్యపెట్టలేదు. వీటిలో కొన్ని సంతకాలున్న ప్రతులు కూడా వున్నాయి.

ఇక్కడ దాదాపుగా వున్న 350 ఖురాన్ సంబంధమైన గ్రంథాలను పరిశీలిస్తే అక్షరాలను సుపరిశుగా వ్రాయడం, చిత్రలేఖనం, ప్రకాశవంతమైన కాయితాన్ని తయారు చేయడం, సిరా తయారు, బైండింగ్ మొదలైన వాటిలో మానవుడు ఎంత కృషి చేయగలడో అంతా గోచరిస్తుంది. పేజీలో ముత్యాల సేకరణ, వివిధ రంగుల సిరా తయారు, బంగారు మలామా అంచులు, మార్జిన్‌లలో పుష్పాల పూజలు మొదలైన వాటితో వాటినెంతో రమణీయంగా రూపొందించడానికి పడిన శ్రమ, ప్రతిభ, అందుకుఅయిన ధన వ్యయం ఊహించరాని పోవడమే గాక, అందులోని ప్రతి చిన్న

వస్తువులోను అత్యున్నతమైన కళా వైదగ్ధ్యం వ్యక్తపడుతుంటుంది. 360 ఖురాన్ ప్రతులలోని 20 ప్రతులపై ఆయా లేఖకుల సంతకాలు క్రీ. శ. 1288 లోని యాఖుతి-ముస్తాసిమి నాటి నుంచి క్రీ. శ. 1818 లోని మహమ్మద్ ఘజిని షిరాజి వరకు వున్నాయి. వీటిలో పేర్కొనదగింది హిమాయల్ ఖిల్మి అనబడే ఖురాన్ చిన్న ప్రతి. దీనిని నవాబ్ సాలార్‌జంగ్ పూర్వీకుడైన మహమ్మద్ బాఖర్‌కు ఆయన తండ్రి షేక్ మహమ్మద్ అలీ బహూకరించాడు.

ఈ మ్యూజియంలోని రత్నఖచిత వస్తువుల గదిలో వున్న యాఖుత్ ఖురాన్‌ను గురించి కొంత తెలుసుకోవడం అప్రస్తుతం కాదు. దీనిలో 10" × $6\frac{3}{4}$" ప్రమాణంలో వున్న పేజీలలో ప్రతి పేజీలో 15 పంక్తులున్నాయి. ఈ పుస్తకం మొదటి పేజీలో మొఘల్ చక్రవర్తులైన షాజహాను, జహంగీర్ చివర పేజీలో ఔరంగజేబుల చరిత్రాత్మక సూచనలు నాష్కలో లిఖింపబడి వున్నాయి. ఈ గ్రంథాన్ని ప్రాచీన మొఘల్ రీతిలో రమణీయ పుష్ప విన్యాసంతో వున్న సరిగె పట్టుతో బైండు చేశారు.

ఈ అమూల్యమైన గ్రంథ సంచయానికి వున్న ప్రాముఖ్యతను పురస్కరించుకుని నవాబ్ మెహిదీనవాజ్‌జంగ్. కీ. శే. ప్రొఫెసర్ హూస్సేన్ అఫ్ఘాన్‌ల సిఫార్సులపై ఎస్టేట్ కమిటీ వారు ప్రఖ్యాత పండితుడైన డాక్టర్ యం. నిజాముద్దీన్‌ను ఈ అమూల్య గ్రంథాల జాబితాను తయారు చేయడానికి సలహాదారుగా నియమించుకొని వారి అమూల్య సలహాలను వినియోగించుకుంటున్నారు. ఈ పండితుడు పర్షియా, అరబ్ లిఖిత ప్రతుల జాబితాను రూపొందించి, దశాంశ పద్ధతిలో విషయ సూచికను రూపొందించే విధానాన్ని కూడా పర్యవేక్షించారు. ఈయన వివిధ విషయాలపై తయారు చేసిన 20 సంచికల జాబితాలలో తత్వశాస్త్రం, తర్కశాస్త్రం, మత శాస్త్రం, తత్సంబంధమైన విషయాలున్న మొదటి సంచికను డాక్టర్ నిజాముద్దీన్ ఇటీవల ప్రచురించారు. మిగతా 19 సంచికలకై పండితులు ఆతురతతో ఎదురు చూస్తున్నారు.

సాలార్‌జంగ్ మ్యూజియంలో వున్న అపూర్వ కళా ఖండాలకు, సుందర వస్తు సముదాయానికి ఇదొక సంగ్రహ ఉపోద్ఘాతం. ఇక్కడ వున్న అపూర్వ వస్తు సముదాయం అపూర్వ కళా రహస్యాలను తెలపడమే గాక, కీ. శే. నవాబ్ సాలార్‌జంగ్ ఉత్సాహాన్ని కూడా తెలుపుతవి. ఈ మ్యూజియంలో దక్షిణ భారతదేశపు కంచు విగ్రహాలు, సంస్కృత లిఖిత ప్రతులు తక్కువగా ఉన్నాయి. ఈ కొద్ది లోపాన్ని కూడా తీరిస్తే ఇదొక సాంస్కృతిక విద్యా కేంద్రంగా విలసిల్లగలదు. ఈ ప్రదర్శనశాల ఇప్పుడు ప్రపంచంలోని అనేక మంది ప్రజను ఆకర్షిస్తున్నది. దీనినిప్పుడు దక్షిణ భారతదేశానికి జాతీయ వస్తుప్రదర్శనశాలగా చేయడంతో కీర్తిశేషుడైన నవాబ్ సాలార్‌జంగ్ కన్న కలలు నిజం అయి యాత్రికులను, పరిశోధకులను ఆకర్షించడమే గాక భారతదేశంలో జాతీయ సమైక్యానికి ఇదొక సజీవ విద్యా కేంద్రంగా వెలుగొందుతుందని ఆశించవచ్చు.

(ఇంగ్లీషు మూలం)

---

అయ్యయో! జీవనవసంతమా! త్వదీయ
గర్భమున నెన్ని పుష్పరాగములు మాసి
పోయె! ఎంతెంత మధువింకిపోయె! ఎంత
శోకమును మ్రింగి, త్రేన్చు వీశోభనీవు!

**"మధుగీత"**

# ప్రభుత్వ నిర్ణయాలు

ఈ క్రింద పేర్కొన్న సహకార సంస్థలకు ఋణాలు పొందడానికై హామీగా వుండటానికి ప్రభుత్వం నిశ్చయించింది.

(1) విజయ నగరంలోని సమ్మతెగల సహకార ఆర్థికాభివృద్ధి కార్పొరేషను, విజయవాడలోని స్టేట్ ఫైనాన్షియల్ కార్పొరేషను నుంచి పొందే అయిదు లక్షల రూపాయల ఋణం

(2) రసాయనిక ఎరువుల ఉత్పత్తికి పెట్టుబడి పెట్టే నిమిత్తం ఆంధ్రప్రదేశ్ సహకార బ్యాంకు అప్పుచేసే రూ 100 లక్షల రొక్కం.

(3) స్టేట్ ఫైనాన్షియల్ కార్పొరేషనునుంచి అప్పు తీసుకొనే నిమిత్తం చీరాల సహకార నూలు మిల్లులకు పది లక్షల రూపాయలకు హామీ.

(4) మూసీ ప్రాజెక్టు ప్రాంతంలోని సహకార సంఘాలు, ప్రస్తుత సంఘాలను అభివృద్ధిపరిచే నిమిత్తం స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియా నుంచి తీసుకునే రూ. 25 లక్షల ఋణం.

(5) ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సహకార బ్యాంకు ఇనుము, ఉక్కు, విద్యుత్ టర్బైన్లను ఉత్పత్తిచేసేనిమిత్తం స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా నుంచి తీసుకునే రూ. 40 లక్షల అప్పు.

## సహకార చక్కెర ఫ్యాక్టరీలు

ఆముదాలవలస, చిత్తూరు, పాలకొల్లు, చోడవరం, నిజామాబాదులలోని సహకారచక్కెర ఫ్యాక్టరీలకు అయిదింటికి చెరి పదిహేను లక్షల రూపాయల భారత ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాలు హామీగా వుంటాయి.

## సింగరేణి కాలరీస్

సింగరేణి కాలరీల ఉత్పత్తి ప్రమాణాన్ని 30 లక్షల టన్నులనుంచి 66.5 లక్షల టన్నులకు హెచ్చించే నిమిత్తం రాష్ట్రప్రభుత్వానికి అప్పు ఇవ్వడం ద్వారా కాలరీల వాటాలకు పెట్టుబడి పెట్టే నిమిత్తం భారత ప్రభుత్వాన్ని కోరడానికి రాష్ట్ర ప్రభుత్వం నిశ్చయించింది. హెచ్చించబడిన రూ. 6 కోట్ల వాటాధనంలో రాష్ట్ర ప్రభుత్వం రూ. 3.6 కోట్లు పెట్టుబడి పెట్టుతుంది. సింగరేణి కాలరీల డైరెక్టర్ల బోర్డు అధ్యక్షుడినీ, మేనేజింగ్ డైరెక్టరునూ నియమించే అధికారం రాష్ట్ర ప్రభుత్వానికే వుంటుంది.



చెలువా! ఓ చెలవా! సుమ సీమ ముద్దు!
పల్లవమె కాని మనదిందు పండుటాకు
మ్రోడు గని జాలిపడు చిగురొండు లేదు
వేడి నిట్టూర్పులను ఖర్చు పెట్టెదేల?

"మధుగీత"

# సవరలు-సంగీతం-న్యాయస్థానాదులు

శ్రీ జి. వి. రామమూర్తి

## సంగీతం

సవరల సంగీత శాస్త్రము అత్యల్పమయినది. కాని నేటి మన సంగీత శాస్త్రమునకు వీరి సంగీత శాస్త్రము వంటిదే ప్రాతిపదిక అయుండవచ్చునని మనము ఊహించడానికి వీరి సంగీత శాస్త్రము తోడ్పడుతుంది.

ఇతర కొండజాతుల వారికి ఉన్నట్టే వీరికీ సొన్నాయి. వంటి ఊదే వాద్యాలు, వీణ, ఫిడేలు వంటి తంతి వాద్యాలు చేత్తో గాని, కర్రతో గాని కొట్టి వాయించే వాద్యాలు ఉన్నాయి.

తంతి వాద్యాలలో వీరికి మూడు ఉన్నాయి. అందులో ఒకటి "డంబుంగ్ రజా." ఇది ఆనపతుంబకు సన్నని వెదురు బొంగు మార్చి పెట్టినది దానిపైన రెండు తంతులు అమర్చి కడతారు. దీనిని పాటలు పాడేటప్పుడు శ్రుతికోసమే వినియోగిస్తారు. పూజ పాటలలో దీని వినియోగం ఎక్కువ. దీనిపైని స్వరాలు పలుకవు. స్వరాలకోసం వినియోగించే వాద్యాలు రెండున్నవి.

ఒకటి ఫిడేలు వంటి "గగ్గోడ్ రజా". ఇది సుమారు 12 అంగుళాల పొడవు గలది. వెదురు కర్రకు కొబ్బరి చిప్పవంటి దానిని ఒక చివరను బిగించి ఆ చిప్పకు పైని పల్చని ఉడుము తోలు కప్పుతారు. కొబ్బరిచిప్పలో నుండి కొద్దిగా బైటకు కన్పించే వెదురుకర్ర చివరను రెండు తీగలు బిగించి, చిప్పపై నుండి ఆ తీగలను తీసి, వెదురు కర్రకు రెండవ చివరను బిగించిన రెండు చిన్న పిడులకు తగిలిస్తారు. ఈ చిన్న పిడులు కావలసిన శ్రుతులకు తీగలను బిగించడానికి అనువుగా కన్నాలలో అమర్చబడి ఉంటాయి. చిప్పకు పైనుండే తోలుకు తీగలు తగలకుండా చిన్న వెదురు బద్దతో ఎత్తి ఉంచుతారు. నారతో కట్టిన చిన్న విల్లుతో యీ రెండు తీగలను రాస్తూ మనవారు ఫిడేలు వాయించినట్టే వాయిస్తారు. ఇటువంటి ఫిడేళ్ళను మన గ్రామాల్లో అమ్ముతూ ఉంటారు.

రెండో తంతి వాద్యము "మెమెరజన్". దీన్ని "కెంకేన్ రజన్" అని కూడా అంటారు. మెట్లు గల తంతి వాద్యము సవరలకు యిది ఒక్కటే. దీన్ని కూడ గుల్ల వెదురు కర్రతోనే చేస్తారు. ఈ కర్రకు ఒక చివరను వంకరగా మీదకు ఎత్తు పెట్టి నిలచి ఉండే ఒక కొమ్ము ముక్కను బిగిస్తారు. తీగలను దీనికి ముడివేయడానికి వీలుగా రెండు కన్నాలు పొడుస్తారు రెండవ చివరను రెండు చిన్న కర్ర పిడులను రెండు కన్నాలలో బిగిస్తారు. ఈ పిడులు తీగలను శ్రుతిచేయడానికి ఉపయోగపడతాయి. ఈ వెదురు కర్ర సుమారు 18 అంగుళాల పొడవు ఉంటుంది. దీన్ని రెండు చిన్న ఆనపతుంబలమీద బిగిస్తారు. శ్రుతిచేసే పిడులకు దగ్గరగా మూడు మెట్లు ఉంటాయి. ఆ మూడు మెట్లపై నుండి ఒక తీగను ఈ చివరనున్న ఒక పిడి నుండి రెండవ చివర నున్న కొమ్ముకు బిగిస్తారు. ఈ తీగకు కొంత దూరంగా ప్రక్క నుండి రెండవ తీగను బిగిస్తారు. ఈ రెండవ తీగ శ్రుతిగా మీటడానికి మాత్రమే ఉపయోగపడుతుంది. మెట్లపై నుండి బిగించిన తీగ మీదనే స్వరాలు వాయిస్తారు.

ప్రక్క తీగ షడ్జమ స్వరంలో ఉంటుంది. పై తీగ మెట్లపైన నొక్కకుండా ఉంచే కాకలి నిషాదంలో ఉంటుంది. దీన్ని మెట్లపైని నొక్కి వాయిస్తే షడ్జ, చతుశ్రుతి రిషభ, సాధారణ

గాంధార స్వరాలు పలుకుతాయి. స్వరాల తీగ నిషాదంలో ఉంటుంది, కనుక మొదటి మెట్టు నొక్కినప్పుడు షడ్జమం పలుకుతుంది. శ్రుతి తీగతో స్వరైక్యమును పొందుతుంది.

సవరివారి పాటలలో నిషాధ, షడ్జమ, రిషభ స్వరములే ఎక్కువగా వినబడతాయి ఏ కొన్నిపాటల్లోనో గాంధారం వినబడుతుంది.

సవర పాటలలో ఎక్కువగా వినబడే మొదటి మూడు స్వరాలలోనే ఋగ్వేద మంత్రాలను గాన చేయడం చూస్తే మన పూర్వులకు కూడా ఆరంభంలో యీ మూడు స్వరాలే ఉండేవని అనుకోవచ్చును మన సప్త స్వరాలు తర్వాత క్రమంగా ఏర్పడినాయని కొందరి అభిప్రాయము. నిషాధులయిన సవరల మొదటి స్వరం పేరిట నిషాధ శ్రుతిని మనవారు ఏర్పరచుకున్నారని కూడా మనం భావించవచ్చును.

"సరాకద్ రజన్" అనే మరో వాద్యాన్ని సవరలు నలుచదరంగా జాయపుడకలతోను, బద్దలతోను తయారు చేస్తారు ఇది లయవేయడానికి మాత్రమే పనికివస్తుంది.

## తగవులు—తీర్పులు

మన్యాలలో ఉండే సవరలు యీ నాటికీ వారి పాత కాలపు సంఘ కట్టుబాట్లకు లొంగి ఉంటున్నారు. వారికి వారి మతమందు ఒకవిధమైన ప్రేమా, భయమూ ఉన్నాయి. సంఘ సంప్రదాయాలను అతిక్రమించరు. గ్రామ పెద్దలు నిర్ణయించిన ప్రకారము కాదనకుండా విధించిన శిక్షకు లోబడుతున్నారు.

తనకు ఇంకొకరి వల్ల అపకారం జరిగితే ప్రతీకారం చేసి తీరుతాడు. ఏ సవరవాడయినా సరే, అలా చేయడం గొప్పగానే చెప్పుకుంటాడు వాడు. కాని సంఘాన్ని అగౌరవపరచినట్టు గ్రామ పెద్దలు భావించి తగిన శిక్షను వారు విధిస్తారు సాధారణంగా తప్పు చేసినవాడు గ్రామములోని వారందరకూ తాగడానికి యిస్తాడు, విందు చేస్తాడు

ఏ గ్రామ పెద్దలు ఆ గ్రామములోని తగవులను పరిష్కరిస్తారు. రెండుగ్రామములలోని వ్యక్తులకు తగవులు ఏర్పడినప్పుడు వాటిని వారి సంప్రదాయానుసారంగా పరిష్కరించుకుంటారు. ఒక గ్రామస్తుని పందినో, మేకనో యింకొక గ్రామస్తుడు తన గ్రామ పొలిమేరల్లో చంపితే ఆ గ్రామాధికారికి మొదటివాడు ఫిర్యాదు చేస్తాడు. దానిమీద ఆ గ్రామాధికారి (గొమంగ్) విచారణ జరుపుతాడు. సర్వసాధారణముగా దొంగ ఫిర్యాదులు ఎవరూ చేయరు. అబద్ధపు సాక్ష్యాలు యివ్వరు. తప్పుచేసినవాడు తన తప్పును ఒప్పుకుంటాడేగాని లేదని అబద్ధము ఆడడు. అందువల్ల తగవులు సులభంగానే పరిష్కారము అవుతూ ఉంటాయి. సత్యమన్నది యింకా యీ ప్రపంచంలో ఎక్కడ ఉన్నదంటే ఈ సవరలలోను, యింకా యిటువంటి కొండ జాతుల వారిలోను ఉన్నదని చెప్పవలసి ఉంటుంది.

సవర దేశములో హత్యలు తరచు జరుగుతూనే ఉంటాయి. ఈ హత్యలు కక్షవలన జరుగడము కంటె క్షణికమైన ఉద్రేకం వలననే ఎక్కువగా జరుగుతూ ఉంటాయి. ఉద్రేక పరిస్థితులలో ఎవరైన కలుగజేసుకుని అడ్డుకుంటే అంతా మామూలుగా అయిపోతుంది. తగవు లాడినవారు మళ్ళీ కలసిమెలసి తిరుగుతారు. కాని వారిలో ఏ ఒక్కరికైనా అన్యాయం జరిగి ఉంటే అంతటితో ఆగదు ప్రతీకారం చేసేవరకూ బాధితుడు ఊరుకోడు.

హత్యచేయాలనే తలంపుతో ముందుగానే ఏర్పాట్లు చేసికొని హత్యచేయడం ఎక్కడో ఎప్పుడో గాని జరుగదు, తాటాకు మంటలాగ ఎవరికైనా ఉద్రేకం రావడం ఆ ఉద్రేకంలో వెంటనే చంపివేయడము జరుగుతూ ఉంటుంది.

వారు కల్లుతాగుతారు గనుక ఒళ్లుతెలియక హత్యలు చేస్తారని ఎవరైనా అనుకుంటే అది పొరపాటు. తనకు జరిగినఅన్యాయానికి తగిన న్యాయం జరుగకపోతే తనకు అన్యాయం చేసినవాణ్ని చంపి తీరుతాడు సవరవాడు. చంపాలని నిశ్చయించుకుని వెళ్తున్న వ్యక్తి తనలో స్వతహాగా ఉన్న మంచితనం తనకు అడ్డురాకుండా ఉండాలనే కల్లుతాగి మరీ బయలుదేరుతాడు. అలా హత్యచేయడము న్యాయమనే హంతకుడు భావిస్తాడు. అందువల్ల "నేను హత్య చేశా"నని అందరిముందు చాటుతాడు గాని హత్యను కప్పి పుచ్చడానికి ఏ మాత్రం ప్రయత్నించడు.

బ్రిటిష్‌వారి పరిపాలన క్రిందకు ఈ సవరలు రాక పూర్వం గ్రామపెద్ద గొమాంగ్ యితర పెద్దల సహాయంతో ఎటువంటి నేరాలనైనా పరిష్కరించి నేరానికి తగిన శిక్షను విధిస్తూ ఉండేవాడు. ఆ ఆచారము నేటికీ కొన్ని చిన్న నేరాల విషయముల్లో అమలులో ఉంది.

సవరదేశములో యిదివరకు అంటే—ముప్పై నంబై

సంవత్సరాల క్రితం జరిగిన హత్యా నేరాలను మనం పరిశీలిస్తే వీరు ఎంత చిన్న విషయాలలో ఉద్రిక్తులై హత్యలు చేస్తారో మనకు తెలుస్తుంది. అంతేకాదు. వారు ఎంతటి కల్మషం లేనివారో కూడా మనకు అర్థమవుతుంది. వారి తాత్కాలిక ఉద్రేకం చల్లారి పోగానేవారి హృదయము వెన్నలాగ ఎలా కరిగిపోతుందో కూడా మనం చూడవచ్చును.

ఒక సవరవాడు ఒకనాటి ఉదయమే వేటకని అడవిలోకి వెళ్లాడు. వాడి అదృష్టం ఆనాడు బాగుండక ఒక జంతువు గాని, ఒక చెవుల పిల్లిగాని, కనీసం ఒక పిట్ట అయినా ఆ రోజున వాడికి దొరకలేదు. ఆకలితో సాయంత్రం యింటికి చేరుకున్నాడు. అన్నం పెట్టమని తల్లిని అడిగాడు. ఆ రోజున యింట్లో ఏమీలేకపోవడం వల్ల ఒక్క అన్నమే ఆమె వండింది. ఆ వట్టి అన్నమునే కొడుక్కు పెట్టింది. కొడుకు నంచుకొనడానికి ఏమైనా వేయమన్నాడు. అసలే యింట్లో ఏమీ లేకపోవడం వలన తల్లి బాధపడి. "మొగాడివి వేటకువెళ్లి ఏమితెచ్చావు? ఒక పిట్టనైనా కొట్టలేక పోయినవాడికి యీమాత్రం చాలదా?" అనిఅంది.

అసలే ఆకలితో బాధపడుతున్నవాడికి తల్లి దెప్పినందుకు కోపం వచ్చింది. ఆ ఉద్రేకంలో అప్పుడే మూలను పెట్టిన విల్లును తీసుకుని బాణం సంధించి తల్లినికొట్టాడు. తల్లి వెంటనే నేలవాలి చచిపోయింది. అప్పటికిగాని తను చేసిన తప్పును ఆ సవరవాడు తెలుసుకొనలేక పోయాడు. వెంటనే తల్లిమీదపడి గోలుగోలున చంటిపిల్లవాడిలాగ ఏడవడం మొదలు పెట్టాడు. తరువాత గ్రామ పెద్ద నిర్ణయించిన ప్రకారము జరిమానా చెల్లించాడు.

తర్వాత కొన్నాళ్లకు యీ హత్య విషయం పోలీసులకు తెలిసింది. హంతకుడ్ని పట్టుకుని కేసుపెట్టారు. తనను ఆ పోలీసులు ఎందుకు పట్టుకున్నారో వాడికి అర్థము కాలేదు. ఎవరు ఎంతచెప్పినా రాజ్య పరిపాలనా విధానంగాని, న్యాయస్థానాల ఆవశ్యకతగాని వాడికి తెలియలేదు.

"నేను నా తల్లిని నాచేతులతో చంపినందుకే ఏడుస్తూ ఉంటే ఇదంతా ఏమిటి? నేను చేసినతప్పుకు నాతల్లి నాకు దూరమయింది! నా గ్రామ పెద్దలు విధించిన శిక్షను నేను అనుభవించాను. మళ్లా మీరు నన్నెందుకు యీ హత్య విషయంలో పట్టుకున్నారు?

"తెల్ల దొరల పరిపాలనా విధాన మంటున్నారు మీరు ఈ తెల్లదొరలు ఎవరు? ఈ దేశం మనదా? ఈ తెల్లదొరలిదా?" అంటూ న్యాయస్థానంలో న్యాయాధికారి సమక్షంలో అడగడం మొదలు పెట్టాడు అమాయకుడైన ఆ సవర హంతకుడు.

ఈ ముచ్చట అరవై సంవత్సరాల క్రితంది. ఇలాంటిదే మరియొక ముచ్చట.

ఒక సవరవాని మేక కనబడలేదు ఒక మాంత్రికుని వద్దకు వెళ్ళి ప్రశ్న వేశాడు. ఆ ప్రశ్నకు "నీగ్రామానికి దక్షిణంగా ఉన్న గ్రామంలోని ఒక ఒంటి కన్నువాడు నీ మేకను చంపి వేశాడు. దాన్నివండుకొని తినేశాడు కూడ. వాడి గ్రామానికి చేరువలో ఒక మామిడిచెట్టు కింద ఆ మేకతోలు. కొమ్ములు మొదలయినవి పాతిపెట్టాడు." అని సమాధానం వచ్చింది.

ఆ మాంత్రికునివద్ద ఆ మామిడిచెట్టును గురించి వివరాలు తెలుసుకుని, వెళ్లి, అక్కడ తవ్విచూశాడు. ఆ సవరవాడు. వాడి మేక తాలూకు చర్మం మొదలయినవి దొరికినవి. దాంతో వాడిలో ఉద్రేకం చెలరేగింది. ఆ గ్రామంలోకి వెళ్లాడు. ఆ ఒంటి కన్నువాడు ఎవడో తెలుసుకున్నాడు వాడ్ని పట్టుకుని "నా మేకను ఎందుకు చంపేవు?" అని అడిగాడు. మేకను చంపినవాడు క్షమాపణ చెప్పుకోకుండా కాస్త నిస్సారంతో మాట్లాడాడు. "ఒరే యిది నీగ్రామమయిపోయింది. అందుకని నిన్ను యీనాటికి వదిలిపెట్టేస్తున్నాను. కాని నిన్ను ఏనాటికైనా చంపితీరుతాను. చూసుకో. ప్రాణానికి ప్రాణమే తీసుకుంటాను. సుమా!" అని హెచ్చరించి ఆనాటికి ఆసవరవాడు వెళ్లిపోయాడు.

మరి కొద్ది రోజులకే ఆ ఒంటికన్నువాడు వీడికి ఒంటరిగా అడవిలో దొరికాడు. వెంటనే వీడి బాణానికి వాడు బలి అయిపోయాడు. తనకోర్కె నెరవేరినందుకు, ప్రతీకారం తీసుకున్నందుకు సంతోషంతో తను చేసిన హత్యనుగురించి తన గ్రామంలో అందరిముందు చాటాడు. ఆరెండు గ్రామాల పెద్దలు నిర్ణయించిన ప్రకారము జరిమానా చెల్లించి అందరకూ కల్లు యిచ్చి విందు చేశాడు.

తర్వాత మరికొన్నాళ్లకు పోలీసులు హంతకుడ్ని పట్టుకుని కోర్టులో కేసుపెట్టారు. మేజేస్ట్రేటు ముందు కేసు విచారణకు వచ్చింది.

"ఔను, నేనే వాడ్నిచంపేను. నామేకను వాడు చంపేడు. కనుక వాడ్ని నేను చంపేను. అందుకు నా గ్రామ పెద్దలు విధించిన శిక్షను నేను అప్పుడే అనుభవించాను. మళ్లా ఈ విషయాన్ని

అడగడానికి మీరు ఎవరు? నేను చంపలేదంటే కదా మీరు విచారణ జరపడానికి?" అంటూ కోర్టువారు చెప్పిందైనా వినిపించుకోకుండా ఎదురు ప్రశ్నలు వేయడం మొదలుపెట్టాడు.

హంతకుడు ఒప్పుకన్నా, సాక్ష్యం అవసరమని ఒకసాక్షిని కోర్టులో పోలీసువారు నిలబెట్టారు. ఆ సాక్షి వచ్చి చెప్పడానికి యింకా నోరు తెరచాడో లేదో "ఏమిరా నేను వాడ్ని చంపినప్పుడు నువ్వు అక్కడ ఉన్నావా? ఎందుకురా అబద్దం మాట్లాడతావు? ఆ రోజున నా అన్నతో కలసి నువ్వు సంతకు వెళ్లావుకదరా? ఇంతకూ నేను చంపలేదంటే కదరా నువ్వువచ్చి నేను చంపేసానని చెప్పడానికి?" అంటూ ఆ సాక్షిని విదిలించడం మొదలుపెట్టాడు హంతకుడు. "ఆ సాక్షిని ప్రశ్నించడానికినీకు అవకాశం తర్వాత యిస్తాము. కాస్త ఆగు" అని మేజిస్ట్రేట్ హెచ్చరిస్తే,

"నిజంచెప్పి, నేనే హంతకుణ్ని అని నేను ఒప్పుకుంటూ ఉంటే నీకు పనికిరాలేదా? అబద్ధపు సాక్ష్యం, దొంగసాక్ష్యం నీకు కావాలా?..." అంటూ యీ విధంగా ఆ అమాయకుడైన సవర వాడు ఆ కోర్టులో అడగడం మొదలు పెట్టాడు. ఇది 30 సంవత్సరాల క్రిందటి ముచ్చట. ఇటువంటి ముచ్చట్లు యింకా చాలా ఉన్నాయి.

---

# గుంటుపల్లి గుహలు

శ్రీ జి. ఆర్. వర్మ

పురావస్తు శాఖవారు ఇటీవల గుంటుపల్లిలో త్రవ్వకాలపని ప్రారంభించినపుడు బౌద్ధ శిల్పావశేషాలు కనుగొన్నట్లు తెలియజేయబడింది. గుంటుపల్లి తాడేపల్లిగూడెమునకు 4½ మైళ్ళ దూరంలో జీలకర్ర గూడెం దగ్గర ఉన్నది.

గుంటుపల్లి గుహలను గూర్చి చిరకాలంగా ఏ విధమైన పరిశోధనలూ జరగలేదు. ఇక్కడ బౌద్ధస్తూపం, చైత్యం వున్నాయని చాలా కొద్దిమందికి మాత్రమే తెలుసు. ఐతే ఇక్కడి ప్రజలు యీ చిహ్నాలను శైవమత (ధర్మ లింగేశ్వర) కేంద్రంగానే పరిగణించేవారు. యాత్రకని ఇక్కడికి వచ్చేవారు. ఈ ప్రాంతంలో శ్రీరామచంద్రుడు వాసనమేటుడై కొంతకాలం ఉన్నాడని మరికొంత మంది భావన.

ఇక్కడి గుహలలో రాతిలో మలచబడిన విహారమందిరం చైత్యాలయం ఇటుకలతో కట్టిన స్తూపములు ఉన్నాయి. బౌద్ధ భిక్షువుల నివాసం కొరకై రాళ్లతో కట్టిన ఇండ్లుఉన్నాయని తెలియచెయ్యబడింది. పురావస్తుశాఖవారు 19 రాతి స్తూపములు, చలువరాతితో నిర్మించబడిన మరొక స్తూపమూ నీళ్ళకొరకై రాతితో చేయబడిన పెద్దబాన, చంద్రకాంతపు శిలలో మలచబడిన బుద్ధవిగ్రహములు ఆరు, ఇంకాకొన్ని ఇతరవస్తుసామాగ్రులను కనుగొన్నారు.

ఇక్కడ కనుగొనబడిన ఇటుకల పరిమాణం చాలా పెద్దది, (21" × 10" × 3") పిటికి, తాడేపల్లిగూడెమునకు 4 మైళ్ల దూరంలోవున్న అరుగొలనుకు చెందిన "ఎఱ దిబ్బ" లలోను, శ్రీకాకుళానికి 12 మైళ్ళదూరంలోని శాలిహుండంలోను దొరికిన ఇటుకలతో పోలికయున్నాయి.

శిల్పరీతుల్లోకూడా బౌద్ధకేంద్రమయిన నాగార్జునకొండను పోలి ఉన్న బౌద్ధ కేంద్రం శాలిహుండంవలె గుంటుపల్లిగుహలు క్రీస్తుశక ప్రారంభంనాటి శాతవాహన ఇక్ష్వాకుల కాలంనాటివిగా గోచరిస్తున్నాయి—గుంటుపల్లి గుహలు అప్పుడే యాత్రికకేంద్రమైనవి. **

??????

# ప్రశ్నలు - సమాధానాలు

!!!!!

రెవరెండ్ పి. జి ఎర్లీ, ఎడ్గాం, నిర్మల్ ఆదిలాబాదు జిల్లా.

ప్రశ్న: ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం రాష్ట్రం మొత్తానికీ ఒక పశు సంక్షేమ సంఘాన్ని స్థాపించి, అన్ని జిల్లాలలోనూ దానికి శాఖలను నెలకొల్పుతున్నదా? "పశు జాతులపై హింసా చర్యల నిరోధన చట్టం" అంశాల దృష్ట్యానేనీ విషయాన్ని తెలుసుకో దలిచినాను.

సమాధానం: రాష్ట్రం మొత్తానికీ ఒక పశు సంక్షేమ సంఘాన్ని స్థాపించి అన్ని జిల్లాలలోనూ దాని శాఖలను నెలకొల్పే ప్రతిపాదనేదీ లేదు. అయితే "పశు జాతులపై హింసా చర్యల నిరోధన చట్టా" (1960) న్ననుసరించి కేంద్ర ప్రభుత్వం పశు సంక్షేమ బోరును స్థాపిస్తున్నది హైద్రాబాదులోని జీవ కారుణ్య సంఘానికి ఈ బోర్డులో ప్రాతినిధ్యం కల్పించబడుతుంది.

శ్రీ ఎం. మోహనరావు రామవరం కొత్తగూడెం.

ప్రశ్న: ఇనామ్ భూములు కొన్నవారికి పట్టాలు లభిస్తాయా లేదా?

సమాధానం: 1954 వ సం. పు హైద్రాబాదు ఇనాముల రద్దు చట్టం క్రింద రద్దు చేయబడని ఇనాముల విషయంలో అయితే పట్టాలను మంజూరు చేసే ప్రసక్తే వుండదు పోతే ప్రస్తుతానికి రద్దు చేయబడి ప్రభుత్వాధీనంలో వున్న ఇనాముల విషయంలో అయితే పట్టాలు ఇచ్చే విషయం ఈ చట్టం ఇతర నిబంధనలు అమలులోనికి వచ్చిన తరువాతనే పరిశీలించబడుతుంది.

శ్రీ ఆర్. హనుమంతరావు. బాపట్ల. గుంటూరు జిల్లా.

ప్రశ్న: మూడు సంవత్సరాల సర్వీసు వున్న పార్ట్‌టైమ్ ఉపాధ్యాయులకు ఎస్. ఎస్ ఎల్. సి పరీక్షకు హాజరు కావడానికి అర్హత వుంటుందా?

సమాధానం: పార్ట్‌టైమ్ ఉపాధ్యాయులకు ప్రైవేటు అభ్యర్థులుగా ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షకు కూర్చొనడానికి అర్హత వుండదు, అవసరమైన యోగ్యతలు వుండి. పరిగణింప బడిన పాఠశాలల్లో పూర్తి సమయం ఉపాధ్యాయులుగా కనీసం మూడు సంవత్సరాలనుంచి పని చేస్తున్న హయ్యర్ ఎలిమెంటరీ గ్రేడు శిక్షణ పొందిన ఉపాధ్యాయులు, అధ్యాపక వృత్తిలో వున్న ఇతరులు మాత్రమే ప్రైవేటు అభ్యర్థులుగా

ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షకు హాజరు కావడానికి అవకాశ ముంటుంది.

శ్రీ కె. కూర్మనాధస్వామి, శ్రీకాకుళం.

ప్రశ్న: శ్రీకాకుళం జిల్లాలో ఒక జనపనార మిల్లును తెరుస్తున్నారని తెలిసింది. దీనిని ఎప్పుడు ప్రారంభిస్తారు? ఎక్కడ నెలకొల్పుతారు?

సమాధానం: ప్రస్తుతం శ్రీకాకుళం జిల్లాలో జనపనార మిల్లును స్థాపించే ప్రతిపాదనేదీలేదు

శ్రీ ఎన్. శివానందం, వీరవాసం, పశ్చిమ గోదావరి జిల్లా.

ప్రశ్న: పాలకొల్లు సహకార చక్కెర ఫ్యాక్టరీ ఉత్పత్తిని ఎప్పుడు ప్రారంభిస్తుంది? దీనికి ఎంత మొత్తాన్ని పెట్టుబడి పెట్టారు? ఎంత మంది కార్మికులకు దీనిలో పని దొరుకుతుంది?

సమాధానం: 1962 మే నాటికి బహుశా ఈ ఫ్యాక్టరీ ఉత్పత్తిని మొదలు పెట్టుతుంది. రూ. 145 లక్షలు దీనికి పెట్టుబడి పెట్టారు. సుమారు 480 మంది కార్మికులకు దీనిలో పని లభిస్తుంది.

శ్రీ కె. దయానంద్, నిజామాబాదు.

ప్రశ్న. జనకంపేట చక్కెర ఫ్యాక్టరీ ఎప్పుడు పూర్తవుతుంది? ఇది రోజుకు ఎంత చక్కెరను ఉత్పత్తి చేస్తుంది?

సమాధానం: భారత ప్రభుత్వం ఇటీవల నిజామాబాదు సహకార చక్కెర ఫ్యాక్టరీకి లైసెన్సు ఇచ్చింది ఈ ఫ్యాక్టరీ ఎప్పటి నుంచి ఉత్పత్తిని ప్రారంభిస్తుందో ఖచ్చితంగా చెప్పటానికి ఇప్పుడు వీలుండదు. రోజుకు 1,000 టన్నుల చెరకు గడను పిండేశక్తి ఈ ఫ్యాక్టరీకి వుంటుంది.

శ్రీ పి. బి. రాజు, రాకోడు; విజయనగరం

ప్రశ్న: కుటుంబ నియంత్రణ సందర్భంగా ఆంధ్రప్రదేశ్‌లో ఎంత మంది స్త్రీ, పురుషులు ఆపరేషన్లు చేయించుకున్నారు? 1961వ సంవత్సరంలో ఎంతమందికి ఆపరేషన్లు జరిగాయి. ఇటువంటివారు విశాఖపట్నం జిల్లాలో ఎంతమంది వున్నారు?

సమాధానం: ఆంధ్రప్రదేశ్‌లో స్టెరిలైజేషన్ అపరేషన్లు చేయించుకున్నవారి సంఖ్యా వివరాలు దిగువ విధంగా వున్నాయి.

1958 లో 596 మంది పురుషులు; 418 మంది స్త్రీలు 1959 లో 852 మంది పురుషులు; 507 మంది స్త్రీలు. 1960లో 1024 మంది పురుషులు, 558 మంది స్త్రీలు. 1961 లో 786 మంది పురుషులు, 771 మంది స్త్రీలు.

హైద్రాబాదులో అబిద్ రోడ్డులోని కుటుంబ సంక్షేమ కేంద్రంలో 1961 వ సంవత్సరంలో 340 మంది విషయంలో సంతాన నిరోధక ప్రక్రియలు జరిపారు

విశాఖపట్నం జిల్లాలో 1961 సంవత్సరంలో 59 మంది పురుషులకూ 24 మంది స్త్రీలకు స్టెరిలైజేషన్ ఆపరేషన్లు జరిగాయి.

శ్రీ టి. జి. రమణారావు, గుంటకల్

ప్రశ్న: (అ) శాసనమండలికి శాసనసభ సభ్యులు ఎన్నుకున్న సభ్యుడికి ఎంత కాలం వరకు ఆ సభ్యత్వం వుంటుంది?

సమాధానం: శాసనమండలికి ప్రతి రెండు సంవత్సరాలకు జరిగే ఎన్నికలలో శాసనసభ సభ్యులచే ఎన్నుకోబడిన సభ్యుడికి ఆరు సంవత్సరాలవరకు ఆ సభ్యత్వం వుంటుంది. ఉప ఎన్నికలలో శాసన మండలికి ఎన్నిక అయిన సభ్యుడికి, ఆ స్థానంలో అతనికి పూర్వం సభ్యుడుగావున్న వ్యక్తి సభ్యత్వ గడువు ముగిసే వరకూ ఆ సభ్యత్వం వుంటుంది.

రాజ్యసభ విషయంలో కూడా సభ్యుల సభ్యత్వ పరిమితి పైన తెలిపిన విధంగానే వుంటుంది

(ఆ) శాసన మండలికి ఒక సభ్యుని ఎన్నుకోడానికి ఎంత మంది శాసన సభ్యులు అతనిని బలపరచవలసి వుంటుంది?

సమాధానం: భర్తీ చేయవలసిన స్థానాలసంఖ్య, పోలైన ఓట్ల సంఖ్య మీద ఇది ఆధారపడి వుంటుంది. ఇందుకు అనుసరించే విధానం 1961 వ సంవత్సరపు ఎన్నికల నిర్వహణ నియమావళి ఏడవ భాగంలో విశదంగా ఉల్లేఖించబడింది.

(ఇ) ఎగువసభ (శాసనమండలి) దిగువ సభ (శాసనసభ) లకు, గవర్నరు ఎంతమంది సభ్యులను నామినేటు చేయవచ్చు?

సమాధానం: గవర్నరు శాసనమండలికి 12 మంది సభ్యులను నామినేటు చేయవచ్చు. గవర్నరు నామినేటు చేసే 12 మంది సభ్యులు సాహిత్యం, శాస్త్రవిజ్ఞానం, కళలు, సహకారోద్యమం, సాంఘిక సేవ, మొదలైన విషయాలలో దేనిలోనైనా ప్రత్యేక పరిజ్ఞానంకాని, ప్రత్యక్ష అనుభవంకాని పొంది వుండాలి. శాసనసభకు ఆంగ్లో ఇండియన్ వర్గానికి చెందిన ఒక వ్యక్తిని గవర్నరు నామినేటు చేయవచ్చు.

పైన పేర్కొన్న విధంగానే రాష్ట్రపతి రాజ్యసభకు 12

మందినీ, లోకసభకు ఇద్దరినీ నామినేటు చేయవచ్చు.

(ఈ) ఉభయ సభలకు నామినేటు చేయడానికి గవర్నరుకు పేర్లను ఎవరు సిఫార్సు చేస్తారు?

సమాధానం: ఇందుకొరకు నిర్దిష్టమైన నిబంధనేమీలేదు.

శ్రీపి. బైరాగిరాజు, రాకోడు విజయనగరం

ప్రశ్న: (అ) భూ కంపనాలు ఎందుకు సంభవిస్తాయి?

సమాధానం:— స్వల్పమైన భూకంపనాలు సైతం, భూమిపగుళ్లవల్లా పొరలమార్పులు, వ్యత్యాసాలవల్లా సంభవిస్తాయి. వీటికి చుట్టు ప్రక్కల ఉండే ప్రదేశాలలో తరుచుగా భూకంపనాలు వస్తుంటాయి. భూమిలోపలవచ్చే ధ్వనుల వల్ల భూకంపాలు సంభవించక పోవచ్చు.

(ఆ) విజయనగరంలోనూ, ఆ సమీప ప్రాంతాలోనూ ఇటీవల సంభవించిన భూకంపనాలపై విజయనగరం తాలూకాలో పరిశీలనలు జరిపారా? అయినట్లయితె ఈ పరిశీలనలో తేలిన విషయాలను క్లుప్తంగా తెలియజేయండి.

సమాధానం:— అవును, విజయనగరంలోనూ దానికి చుట్టూరా 2–3 మైళ్లవరకు వున్న ప్రాంతంలోనూ భూకంపనాలు ఎక్కువగా సంభవిస్తున్నాయి. దీనికి ముఖ్యకారణాలు ఇవి:— (1) భూమి పొరలలో భారీఎత్తున వ్యత్యాసాలు, మార్పులు వచ్చే ప్రదేశానికి దగ్గరలో వుండటంవల్ల, (2) భూగర్భంలో పగుళ్లు ఏర్పడటం వల్ల, పొరలమార్పులవల్ల— వీటి మూలంగా నేలకంపిస్తుంది. (3) భూగర్భంలోని సున్నం పదార్థం మొదలైనవి వాతావరణ పరిస్థితులకు కుదిరించుకొపోవడంవల్ల



1962 ఫిబ్రవరిలో దిగువ పేర్కొన్న గ్రామాలలో, సంస్థలలో కమ్యూనిటీ రేడియో సెట్టులను నెలకొల్పారు.

| క్రమ సంఖ్య | జిల్లా | తాలూకా | గ్రామం లేక సంస్థ పేరు | సెట్టును నెలకొల్పిన తేదీ |
|---|---|---|---|---|
| 1. | నిజామాబాదు | ఆర్మూరు | లఖోర | 15–2–62 |
| 2. | మెదక్ | మెదక్ | రుక్మాపూర్ | 7–2–62 |
| 3. | .. | .. | సిటీమునిసిపాలిటీ, మెదక్ | 7–2–62 |
| 4. | .. | సిద్దీపేట | పెద్దకోడూరు | 9–2–62 |
| 5. | ఆదిలాబాదు | నిర్మల్ | మజాలాపూర్ | 12–2–62 |
| 6. | .. | ఖానాపూర్ | ఖానాపూర్ | 14–2–62 |
| 7. | నల్గొండ | — | యాదవల్లి | 18–2–62 |
| 8. | చిత్తూరు | చిత్తూరు | కోనేపల్లి | 21–2–62 |
| 9. | విశాఖపట్నం | పాడేరు | సీలేరు ప్రభుత్వ మాధ్యమిక పాఠశాల | 17–2–62 |

## నాలుగో భూతం చెప్పిన కథ

నా పేరు శకుంతల, మా అమ్మ పేరు లలితాంబ. మానాన్న పేరు చెప్పినా మీరు తెలుసుకోలేరు. గనక చెప్పడం అనవసరమే ననుకొంటాను. అదీగాక—మా నాన్న పరమ చాదస్తుడు నేనన్నా, నా చదువన్నా ఆయనకంత సదభిప్రాయం ఏనాడూ లేదు. చదువు కొన్న ఆడది చెడిపోతుందంటాడాయన. అటువంటివాడి కడుపున పుట్టినందుకు నేనెంత పశ్చాత్తాప పడాలో చెప్పండి?

మా అమ్మ దేవత. ఆమెగారే లేకపోతే—నేనెలా ఉండే దాన్నో ఊహించుకోవటానికే భయంవేస్తుంది. పదిమందిలోకి వెళ్ళనూ గలదు; పదిమందిని ఇంటికి తీసుకు రానూ గలదు. అభిప్రాయాల్లోనూ, అభిరుచుల్లోనూ మా నాన్న అమ్మలకు పొద్దెమరయినా వాళ్ళెప్పుడు కీచులాడుకున్నట్టుకూడా లేదు. ఎవరి జీవితం వారు జీవిస్తున్నారు. ఒకరి విషయాలో మరొకరు జోక్యం కలగచేసుకోరు. నాదృష్టిలో ఇది ఆదర్శ దాంపత్యం.

తప్పో వొప్పో. పెళ్ళిని గురించి నాకొన్ని అభిప్రాయా లున్నాయి. అన్నిటికి సరిపోయిన వాడు తటస్థ పడినప్పుడే పెళ్ళాడుదామనుకొంటున్నాను. అదృష్టవశాత్తూ దీన్నిగురించి నన్ను బలవంతం చేస్తున్న వారెవరూ లేరు. మానాన్న ఆయన మేనల్లుణ్ని చేసుకొంటె బావుంటుందంటాడు. కిష్టుడు బావకు బోలెడంత ఆస్తి ఉన్నమాట నిజమే; వందెకరాలుగావును పల్లపు భూము లున్నాయి. రెండు పనస తోట లున్నాయి. గాంధీ పార్కంత ఇల్లు ఉంది. కానీ, ఇవేమీ నన్ను ఇన్స్పయిర్ చేయడంలేదు. కిష్టమూర్తిని చూస్తుంటే, ఈ శతాబ్దం మనిషిలా ఉండడు. ఇప్పటికీ చాకింటి చలవపంచలు కడతాడు చుట్ట కాలుస్తాడు. పొద్దుటే చద్దన్నం తింటాడు. పేపరు చదవడు. నవలలు చదవడు. సినిమాలు చూడడు ఆయన దృష్టిలో రామతిలకం గొప్ప నటి. జొన్నవిత్తుల శేషగిరిరావు గొప్పపాటగాడు. 'భయంకర నారీపిశాచి' గొప్ప డిటెక్టివ్ నవలంటాడు. ఈ లోగా వచ్చిన మార్పులు ఆయన్ని అంటలేదు. ఈ మార్పులేవీ ఆయనకు గిట్టవు. మాటిమాటికీ 'పిదపకాలం పిదపకాలం' అంటుంటాడు. ఇటువంటివాణ్ని చేసుకొని సుఖపడతానని మా నాన్న నమ్మిక. ఒకసారి మానాన్నతో ఈ సంగతి కుండపగలేసి చెప్పాను కూడాను.

కథానిక:

# పంచ భూతాలు

శ్రీ రావూరి భరద్వాజ

(గత సంచిక తరువాయి)

"పోనీ బావను బస్తీలో కాపరం పెట్టమను, అలానే చేసుకుంటాను" అనికూడా అన్నాను

"అయితే మాత్రం. ఆ జంగిల్ పెర్సన్‌తో నువ్వెలా ఉండగలవే నాతల్లీ? నువ్వు చేసుకొంటానంటే మాత్రం నేనొప్పుకోవద్దా? కిష్టుణ్ని చేసుకొంటానంటే నేనిప్పుడే సైనెడ్ తాగి చచ్చిపోతాను" అన్నది మా అమ్మ.

"అలా జరిగినా బాగుండిపోను" అన్నాడు మా నాన్న.

అన్నంతపనీ అమ్మ చేస్తుందని కాదుగానీ, నాకూ నాన్నగారి ప్రపోజల్ ఇష్టం లేదుగనక, అమ్మమాటను గౌరవించాలన్న వంకతో, నాన్నను కాదన్నాను. అదృష్టవశాత్తూ నాన్నకూడా అట్టే పట్టుబట్టలేదు.

నాపెళ్ళిని గురించి నాకు లేని దిగులు మా అమ్మకుండటం చూస్తే ఒక్కోసారి చాలా విచారం కలుగుతుండేది నా సుఖం అమ్మ చూడలేదనడం న్యాయం కాదుగానీ, అంతకన్నా ముఖ్యం ఆమె అల్లుడు చాలా గొప్పవాడయి ఉండటం. ఆమెదృష్టిలో గొప్పగా ఉన్నవాడు, నాకూ గొప్పగానే ఉంటాడని ఆవిడ నమ్మకం. తీరా చూస్తే ఏయే గొప్పలు అమ్మకు నచ్చుతాయో ఎవ్వరూ చెప్ప లేరు. మొన్న మొన్నటిదాకా కలెక్టరుగారి పింతల్లి రెండో కొడుకు బావమరిది అమ్మకు గొప్పవాడుగా కనిపించాడు అతన్ని నాలుగు సార్లు పార్టీలకు పిలిచింది. మరో రెండు సార్లు నన్ను వెంటపెట్టుకుని అతనింటికెళ్ళింది, అతన్నీ నన్నూ వొంటరిగా విడిచిపెట్టి తను మెల్లిగా జారుకొంది. మమ్మల్ని సినిమాలకు పంపించింది. పార్కులకు వెళ్ళనిచ్చింది. అమ్మ ఉద్దేశ ప్రకారం నేను మురళిని ఆకట్టుకొని, అతని చేత పెళ్ళికి వాగ్దానం చేయించుకోవాలి మురళి మంచివాడే; కానీ, అతనికి ఆడవాళ్ళతో మాట్లాడటమంటే వల్లమాలిన సిగ్గు. ఇంతవరకూ చలంగారిని చదవలేదట. నేనే పట్టుకెళ్ళి పది పుస్తకాలిచ్చాను. వారం తరవాత అడిగితే, నాలుగు మాత్రమే చదివాననీ. ప్రస్తుతం తనకు చదివే తీరిక లేదనీ అన్నాడు. అయినా చూదామని, అతను చదివిన పుస్తకాలను గురించి అభిప్రాయమడిగాను. చప్పరించేశాడు. అందులోని అభిప్రాయాలు తనకు బొత్తిగా గిట్టవన్నాడు.

ఆడవాళ్ళూ మగవాళ్ళూ అలా ఇష్టం వచ్చినట్టు తిరిగితే సంఘం మట్టి గలిసిపోదా అన్నారు. అటువంటి వాళ్ళని పెళ్ళి చేసుకొనే ప్రమాదం తప్పినందుకు చాలా సంతోషించాను.

పెళ్ళి కావడమే ముఖ్యమయితే, నా చుట్టూ ముసిరే మంద లోంచి ఎవణ్నో ఒకణ్ని ఎప్పుడో పెళ్ళాడి ఉందును. పెళ్ళివల్ల నా ఉద్దేశాలూ, అభిరుచులూ దెబ్బ తినడం నా కిష్టం లేదు. నా అభిరుచుల పట్ల గౌరవం లేనివాడితోనే నేనాడూ కలిసి ఉండలేను. నా ఆలోచనలే నిజమయి, నేను రేపు ఏ సినిమాలోనో వేషాలు వేస్తానంటే, అందుకు ఒప్పుకోని వాణ్ని నేను పెళ్ళాడి మాత్రం లాభ మేముంది? సినిమాల్లో వేషాలు వేయాలన్న కోర్కె ఈ నాటిది కాదు. ఈ కోర్కె చచ్చిపోకుండా నీరు పోసిన వాడు శంకరం.

శంకరం నన్ను చూస్తూనే మెచ్చుకున్నాడు. అందరితోటీ పది నిమిషాలు మాట్లాడనివాడు, నాతో అరగంట కబుర్లాడాడు తను తీయబోయే పిక్చర్‌లో హీరోయిన్ వేషం వెయ్యమన్నాడు ఈ సంగతి అమ్మతో చెప్పినప్పుడు బ్రహ్మానందం అనుభ వించింది.

"నేను మొదట్నించీ అనుకుంటూనే ఉన్నానే తల్లీ! ఒక్క పిక్చర్ బైటికొస్తే; నువ్వింక కోహినూర్‌లా వెలిగి పోవుటే?" అన్నది అమ్మ.

ఆ నమ్మకం నాకూ ఉంది. ఏదో విధంగా, ఒక్క సినిమాలో ఛాన్సు దొరికితే చాలు; ఆ తరవాత, నా ప్రయత్నం అవసరం లేకుండానే బుకింగ్సు దొరుకుతాయి. ఆ ఒక్క ఛాన్సూ శంకరం ఇవ్వడానికి సిద్ధపడ్డాడు. శంకరం మీద నాకెలాంటి అభి ప్రాయమూ లేదు. అథవా వుంటే. అంతో ఇంతో అసహ్యం మాత్రమే ఉంది, ఎర్ర తోలు కనపడితే, అతనిలో ఎక్కడలేని వికారమూ పొర్లుకొస్తుంది. నేనేమను కొంటానోనన్న ఆలోచన కూడా లేకుండా, నాతో బూతుమాటలు అనేవాడు. బూతు అర్థా లొచ్చే మాటలు అనిపించేవాడు. సినిమాలకు తీసికెళ్ళేవాడు సినిమా చూస్తున్నంతసేపూ, అందులోని డైలాగ్సును గురించీ, షాట్స్‌ను గురించీ చెబుతుండేవాడు. అనేకసార్లు, నాచేతిని ముట్టు కొనీ, నా భుజంమీద చెయ్యి వేసి మాట్లాడేవాడు. లోపల అసహ్య మంటూ ఉన్నా బయటకు కనపడనిచ్చేదాన్ని కాదు. ఎందుకంటే, నా భవిష్యత్తంతా శంకరంగాడి చేతుల్లో ఉంది. నాకోసంగాక పోయినా, వాడి బ్రతుకుతెరువు కోసమయినా సినిమా తియ్యక తప్పదు. క్రిములు మురుగులేనిదే బ్రతకలేనట్లు, శంకరంగాడి లాంటివాళ్ళు సినిమాలు లేకపోతే బ్రతకలేరు. అటువంటి వాడితో విరోధం పెట్టుకొని బావుకొనేది మాత్రం ఏముంది? రేపు ఆ ఫీల్డులో కాస్త ఆధారం దొరికాక నేను మాత్రం వీడి ముఖం చూడబొయ్యాను గనకనా? పైత్యకారి వెధవ గనక, కాస్త ఎక్కువ చనువు తీసుకొంటున్నాడని సరిపెట్టుకొన్నాను. ఎందు కైనా మంచిదని అమ్మతోకూడా ఓమాట చెవినేసి ఉంచాను. అమ్మ నవ్వి ఊరుకొంది.

ప్రసాద్ కనిపించకపోతే ఏమయ్యేదో చెప్పలేను గానీ, అతన్ని చూశాక నా పథకమంతా మార్చుకోవలసి వచ్చింది. అతనెందుకొచ్చాడో. శంకరం కోసమొచ్చాడు. అతన్ని చూస్తూనే లక్షాధికారుల బిడ్డడని తెలిసిపోయింది. చేతికి బంగారపు గడియార ముంది. జేబులో వంద రూపాయల నోట్ల కట్ట ఉంది

శంకరం అతనితో కోస్తున్నాడు సినిమా పరిశ్రమ ఇచ్చి నంత లాభాలు మరేపరిశ్రమా ఇవ్వదన్నాడు. ప్రొడ్యూసర్‌గా వచ్చిన వాడికి మందీమార్బలం లోటంటూ ఎప్పుడూ ఉండ దన్నాడు. మామూలు జనం, ఆకాశంలో ఉంటారనుకొనే స్టార్లు, బుకింగ్సు కోసం నీచుటూ మూగుతారన్నాడు. ఇవన్నీ ప్రసాద్ వింటున్నాడని నాకు తోచలేదు. అవతల ఊఁకొడుతూనే, నన్ను మింగేటట్టు చూస్తున్నాడు. ఆ చూపులు నన్ను తడువుతున్నట్టు ఫీలయ్యాను. అతన్ని నిరుత్సాహ పరచడం భావ్యం కాదని పించింది. నేనూ సంభాషణలో జోక్యం కలగచేసుకొన్నాను.

రాను రాను ప్రసాద్ రాక పోకలు ఎక్కువవసాగాయి. అతను శంకరంతో మాట్లాడాలని రావడం ఒకవంకగా మాత్రమే పనికొచ్చేది. శంకరం అక్కడున్నా, అతను నాకేసి తిరిగి కబుర్లా డుతూ ఉండేవాడు. ఈ ఇద్దరి మధ్యా నేను నలిగిపోవలసి వచ్చింది. ఏమంటే, శంకరం ఏమనుకొంటాడోనని నా భయం. మాట్లాడకపోతే ప్రసాద్ నొచ్చుకొంటాడేమోనని మరో భయం! ఇహముందెప్పుడో చూపించాల్సిన నటనంతా, ఈ ఇద్దరి ముందూ చూపించాలిసొచ్చింది.

అయితే ఈ బెడద ఎక్కువ కాలం పడనవసరం లేక పోయింది. శంకరం, స్వయంగా పిలిచి, ప్రసాద్‌తో కాస్తంత చనువుగా ఉండమన్నాడు. అతని చేత పెట్టుబడి పెట్టించితే వెంటనే ప్రొడక్షన్ ప్రారంభించవచ్చు నన్నాడు. అతన్ని మంచి చేసుకోమన్నాడు. ఈ సలహా నాకు బ్రహ్మాండంగా నచ్చింది. దీన్ని అక్షరాలా ఆచరణలో పెట్టాలను కొన్నాను. అయితే

శంకరం ఆశించిన విధంగా మాత్రం కాదు. శంకరంగారు, తన అవసరం కోసం, ప్రసాదును మంచి చేసుకోమన్నాడు. నేను నా అవసరాలకుగాను, అతన్ని మంచి చేసుకోవాలను కొన్నాను. ప్రసాద్‌లాంటివాడు చేతిలో ఉంటే, అతని చేతనే పది సినిమాలు తీయించొచ్చు అప్పుడే బోడి శంకరంతో నాకు అవసరమే ఉండదు ఇటువంటి వాళ్ళను వందమందిని నేనే పనికి పెట్టుకో వచ్చు. ఈ ఉద్దేశంతోనే, నేను ప్రసాదుతో ఖత్తు కలిపాను, అతన్ని మా ఇంటికి తీసుకెళ్ళాను. అమ్మకు పరిచయం చేశాను. నాన్నకు చూపించాను. అమ్మ అతని ఆస్తి వివరాలన్నీ కనుక్కొంది. దాంతో ప్రసాద్ మీద ఎక్కడలేని గౌరవమూ ఏర్పడిపోయింది. ఇప్పుడు మేమిద్దరం కలిసి తిరుగుతున్నాం. దీన్ని చూసి శంకరంగారు ఏడ్చిపోతున్నాడు. 'నా సంగతి చెప్పవే' మంటాడు. ఏమిటి చెప్పాలిట? రేపో మాపో మేమిద్దరం పెళ్ళాడ బోతున్నామనీ, ఆ తరవాతగానీ, సినిమాల గొడవ ఆలోచించమనీ చెప్పాను. శంకరం లబ్బుమని మొత్తుకొన్నాడు. ఏడవనీ వెధవను. ఎవడికిట ఇక్కడ జాలి?

## ఐదో భూతం చెప్పిన కథ

నా పేరు పురుషోత్తం. మా అమ్మాయి పేరు శకుంతల, నేను ప్లీడర్ను. నా చిన్నతనంలో మా నాన్న నీళ్ళ కావిళ్ళు మోశాడు, మా అమ్మ పెద్ద పెద్దవారి ఇళ్ళల్లో వంటపని చేసేది నేను వారాలు చెప్పుకొని చదువుకొన్నాను, దరిద్రమంటే ఏమిటో నాకు తెలుసు. పిడికెడు మెతుకులు లేకుండా రోజులకు రోజులు పస్తులున్నాను. పుస్తకాలు కొనడానికి డబ్బు లేక, తోటి వారిని అరువడిగి పుచ్చుకొన్నాను. వీధి దీపాల కింద కూచుని చదువుకొన్నాను. రైల్వే స్టేషనుల్లో నిద్రపోయాను. భగవంతుడి దయవల్ల ఈనాడింత ఆర్జించ గలుగుతున్నాను.

మనిషికి ఆర్థిక దృష్టి ఉండకూడదని నేనెపుడూ అనను. కానీ డబ్బే ప్రధానమని, నేనిప్పటికీ నమ్మలేక పోతున్నాను. డబ్బును మించిన విలువలు చాలా ఉన్నాయని నా నమ్మకం. ఆ విలువలు సాధించడానికి, డబ్బు ఉండటం లేకపోవడమన్న సమస్య అడ్డు రానేరాదు. కొంత మంది డబ్బుకోసం దారుణంగా హత్యలు చేయడం నాకు తెలుసు. మనిషికీ మనిషికీ ఉండే సంబంధాలను ఈ డబ్బు ఎంత అధ్వాన్నంగా మార్చుతుందో నేను అనుభవం మీద తెలుసుకో గలిగాను.

మా ఆవిడ దృష్టి వేరు. పుష్కలంగా డబ్బున్నవారికి దాని విలువ తెలియదనడం, మా ఆవిడ పట్ల అక్షరాలా రుజువవుతుంది. అది నీళ్ళవతుగా డబ్బును వాడేస్తుంది. వంద రూపాయలకూ, రూపాయకూ, మా ఆవిడ దృష్టిలో భేదంలేదు. బొత్తిగా ఆర్థిక దృష్టి లేకపోవడమూ, అస్తమానమూ, డబ్బు కోసం పాకులాడటమూ తప్పే ననుకొంటాను సుఖంగా జీవించడానిక్కావలసిన మేరకు, ప్రతి వాడికీ డబ్బుండవలసిందే; అవసరాలు మించిపోయెంత ఉన్నప్పుడే అపర బుద్ధులన్నీ పుట్టుకొస్తుంటాయి.

నా అనుభవంలో అనేక మంది భాగ్యవంతులను చూశాను. నా ఖాతాదారుల్లో జమీందార్లున్నారు లక్షాధికార్లున్నారు బాంకర్లున్నారు. వారిని చూస్తుంటే, నాకు ఒక్కొక్కసారి చాలా భయం పుట్టుకొచ్చేది. నిద్రాహారాలు మాని, వ్యవహారాల్లో వారు మునిగి పోవడం నాకు తెలుసు. లక్షలాది సమస్యలతో తల్లడిల్లిపోవడం నాకు తెలుసు. ఈ గిజిబిజినుండి తప్పుకోవడానికి తాగుడుకు అలవాటు పడినవాళ్ళు, ఆడవాళ్ళ వెంటపడినవాళ్ళు నాకుతెలుసు నేను చూస్తుండగానే సర్వనాశన మయిపోయినవారు చాలామంది ఉన్నారు. వారి పిల్లలు ఈనాడు ఎబ్రాసుల్లా తిరుగుతున్నారు.

ధనవంతుల వ్యక్తిగతజీవితంలో ప్రశాంతతకు చోటుండదని నానమ్మకం. ఇచ్చిన డబ్బురాదనో, వచ్చిన డబ్బుండదనో, ఎప్పుడూ దిగులు పడుతూనే ఉంటారు. అదీగాక డబ్బున్నవారి చుట్టూ మనుషులు ఈగ ముసిరినట్టు ముసురుతారు వీరిలో ఎవరు హితులో, ఎవరుకాదో తేల్చుకోవడం కష్టం, నిజం చెబితే ఏం కొంపమునుగుతుందోనని అతనికి ఇష్టమైన కబుర్లే చెబుతుంటారు. అందువల్ల అవతలివాడికి, తాను చెప్పించే సత్యమయినట్టూ అది తప్ప మిగతాదంతా అసత్యమయినట్టూ ఒక భ్రమ కలుగుతుంది. వ్యక్తి నాశనం కావడానికి ఈ భ్రమ పునాదిరాయి వంటిది, ఈ సంగతులన్నీ నాకు తెలుసు గనకనే, శకుంతలను మా కిష్టుడి కిద్దామనుకొన్నాను. ముందు మాఆవిడ ఒప్పుకోలేదు; ఆ తరవాత శకుంతల ఒప్పుకోలేదు ఎదటి వారి అనుభవంనించి నువ్వు నేర్చుకోకపోతే గిడసబారి పోతావు, నాశనమయి పోతావు.

జాగ్రత్త!!

ప్రసాదును చేసుకోడానికి శకుంతల ఒప్పుకొంది, మా ఆవిడా ఒప్పుకోంది. నన్నెళ్ళి ఒక్కసారి మాట్లాడిరమ్మంది. మాట్లాడక పోయినా ఈ పెళ్ళి జరగడం ఖాయమన్నది. కేవలం మర్యాదకొసమే పంపుతున్నానన్నది. ఇన్నిమాటలు ఆవిడచెప్పాక

వెళ్ళకపోవడం నాకే బాగనిపించలేదు. అందుకనే ప్రసాదును చూదామని వెళ్ళాను.

నే వెళ్ళేసరికి, అతను పుట్టెడు దుఃఖంలో ఉన్నాడు. టేబిల్‌మీద టెలిగ్రాం ఉంది. అతని మేనమామ గావును–విచారమూ లేకుండా, కసితీర్చుకోవడమూ లేకుండా మాట్లాడుతున్నాడు. వాళ్ళ ఫాక్టరీలలో అగ్ని ప్రమాదం జరిగిందట. మొత్తం బూడిదయిపోయిందట. ఈ మధ్యనే మేడలు తాకట్టు పెట్టి కొత్తగా మరో గుడ్డల మిల్లు కట్టారుట. అదికూడా తగలబడి పోయిందట. కాంట్రాక్టుల్లో కూడా, నష్టంవచ్చిందట. బికారులయి పొయ్యారుట.

'' పోకేం చేస్తారు బాబూ? కావటానికి మా బావగారే అయినా మహా కర్కోటకుడు లెండి. బాగా ఉన్న రోజుల్లో మమ్మల్ని పురుగుల్ని చూసినట్టు చూశాడు. మా ఉసురు తగలకుండా పోతుందా? భగవంతుడు గంపంత కంటితో చూడడటండీ?" అన్నాడయన, పెట్టెబేడా సర్దుకొంటూ.

ప్రసాదు మాత్రం ఏమీ మాట్లాడలేదు గుడ్లనీరు గుడ్ల కుక్కుకొంటూ కూచుండి పోయాడు.

"సరే నేను వెడుతున్నారా?" అంటూనే ఆయన వెళ్ళిపోయాడు. ప్రసాదు ఉండమన్నా ఉండలేదు.

"ఇంతకాలం మీకు చేసీచేసీ రెక్కలు విరుచుకొన్నాను. బూడిద మిగిలింది. ఇక ఇప్పుడన్నా నా బ్రతుకు బ్రతకనివ్వండి. ఎంతకాలమని మీకూ చేస్తూకూచునేది? నాకూ అవతల పెళ్ళాం బిడ్డలున్నారు. వాళ్ళగతేంకాను?" అన్నాడాయన పోతూపోతూ.

"నువ్వేం చెయ్యదలిచావ్?"వని అడిగాను. ప్రసాదు ముందు కొంతసేపేమీ మాట్లాడలేదు. చదువుమానుకోక తప్పదన్నాడు. ఎక్కడన్నా ఉద్యోగం చేసుకొంటానన్నాడు. అతనికి తెలిసిన వాళ్ళు చాలామంది ఉన్నారుట. వారిలో ఏవరన్నా తనకీమాత్రం ఉపకారం చెయ్యక పోరనికూడా అతనన్నాడు.

ఈ పరిస్థితిలో అతనితో పెళ్ళి ప్రస్తావన ఎలాతీసుకురాను చెప్పండీ? అదీగాక, ఇప్పుడు ప్రసాదు వారికి నచ్చువాడు లేదో నన్న అనుమానంకూడా నాక్కలిగింది. ప్రసాదును పెళ్ళాడటానికి నాకు తెలిసిన కారణమే నిజమయితే, అదిప్పుడు లేదుకనక శకుంతల ఈ పెళ్ళికొప్పు కొంటుందనుకోను. ఒకవేళ శకూవొప్పుకున్న మా ఆవిడ అసలే వొప్పుకోదు.

"మంచిది నాయనా! ఏదో పనుండి పోతూపోతూ చూసి పోదామని వచ్చాను. ఏ సంగతీ నాకు రెండుమూడు రోజుల్లో కనిపించి చెప్పు. నాచేతనైనంతవరకూ నేను నీకు సాయపడుతాను కష్టాలు ఎలాంటి వారికైనా వస్తాయి. మనిషి నిలబడవలసింది అప్పుడే!" అన్నాను.

నామనస్సంతా కెలికినట్లయింది. ఇంటికొచ్చాక 'ఏమయిందేమిటి?' అన్నదావిడ. నేనే సమాధానమూ చెప్పలేదు. కానీ సాయంత్రానికి కల్లా, ఈ సంగతి ఊరంతా పాకిపోయింది. ఫలానా పరంధామయ్యగారి ఆస్తంతా పోయిందనీ, వాళ్ళబ్బాయి, పొట్ట చేతబట్టుకొని ఉద్యోగాలకోసం వెతుకుతున్నాడనీ. అంతా అనుకొన్నారు.

"అదేమిటోయ్. అందరూ, బంగారపు పిచ్చుక నీకు అల్లుడుకాబోతున్నాడనుకొంటే ఇలా జరిగిందేమిటి"? అన్నారెవరో.

"ఇప్పటికయినా అతను మా అమ్మాయిని చేసుకొంటా నాకభ్యంతరంలేదు. బంగారు పిచ్చుక అప్పుడయినా అవుతాడే!" అన్నాను నేను నవ్వుతూ.

మా ఆవిడ రివ్వన వచ్చి అందుకుంది.

"చాల్లెండి. మీదిక్కుమాలిన ఆలోచనలూ మీరూను. వీధిన పొయ్యే బికారికివ్వడానికి, నా కూతురు కుంటిదా గుడ్డిదా? చేతకాక పోతే మీరలా చూస్తూ కూచోండి. దానికి రాజాలాంటి మొగుణ్ణి తెచ్చి నేను చేస్తాను." అన్న దావిడ.

ఇదిజరిగిన మొన్నాడు ప్రసాదు మాఇంటికొచ్చాడు. తన కెక్కడా ఉద్యోగం దొరకలేదన్నాడు. సహాయం చేస్తారనుకొన్న వాళ్ళంతా తప్పుకోరన్నాడు. తన కిప్పుడు పెద్ద పెద్ద ఆశలేమీ లేవన్నాడు. ముందుగా తన తలిదండ్రులను ఇక్కడికి తీసుకరావాలనీ, అందుకోసం తనకింత ఆధరువు కావాలనీ అడిగాడు. శకుంతలను తనిప్పటికీ ప్రేమిస్తున్నానన్నాడు. కొద్దిరోజుల తరువాత, తను పెళ్ళాడ గలననికూడా చెప్పాడు. నేను చెప్పాలనుకొన్న సమాధానం వేరు. నాకా అవకాశం లేకుండానే ఆవిడొచ్చి అనదలిచిన నాలుగు అనేసింది. ప్రసాద్ కళ్ళల్లో నీరు తిరగడం నేను చూశాను.

కథకుడు చెప్పిన కథ:

ఒక్కో మనిషి ఇతరుల అనుభవాల నుండి నేర్చుకొంటాడు. ఒక్కొక్కడు ప్రతిదీతన అనుభవంలోకి రావాలంటాడు. పరంధామయ్య గారబ్బాయి ఈ రెండో కోవాలోకి చేరిన బాపతు. అతను భ్రమతో కూడిన వాతావరణంలో పుట్టాడు. అక్కడే పెరి

గాడు. ఆ భ్రమ తప్ప మరేదీ అతనికి నిజమనిపించేదికాదు. తన చుట్టూ చేరినవారంతా సజ్జనులే ననుకోవడం అతని పొరబాటు; మరెవరో తనను మోసగించారనుకోవడంలో అర్థంలేదు. మోసం చేసేవారు ఎప్పుడు ఉంటూనే ఉంటారు. మోసం చేయడం వారి గుణం. అది నైజం కాకపోవచ్చు; పరిస్థితుల వల్లనే అలా వారు చేస్తూ ఉండవచ్చు. కానీ చేయడం మాత్రం ఖాయం.

ఈ సంఘటనతో అతని కళ్ళు తెరిపెళ్ళు పడ్డాయి. మనుషును అర్థంచేసుకోడానికి ఈ సంఘటన ఎంతగానైనా ఉపకరించింది. ఇంతకాలమూ తనచుట్టూ ఉన్నవారెవరో అతనికిప్పుడు అర్థమయిపోయింది తీరా తెలుసుకొనే వేళకు వారందరూ అతనికి దూరమయిపోయారు.

మేనమామ ఉన్న కసినంతా తీర్చుకొని వెళ్ళిపోయాడు. శంకరం తన ప్రౌఢత్వన్ను గొడవలోపడి, మాట్లాడటానికే అవకాశం ఇవ్వలేదు లలితాంబ, తన్ను చూసి ముఖం తిప్పుకొని పోయింది శకుంతల నడిగితే. తనకిప్పుడు పెళ్ళాడాలన్న ఉద్దేశమే లేదంది: ఈ సంగతులన్నీ జ్ఞాపకం చేసుకొని ప్రసాద్ చిరునవ్వు నవ్వుకొన్నాడు.

మూడోరోజున మరోరకం వార్తలు వెలువడ్డాయి పరంధామయ్యగారి ఫాక్టరీలు తగలపడిన మాట నిజమేగానీ. అందువల్ల వారికేమీ నష్టంలేదనీ, వాటివాటి ఖరీదులకు సరిపడా అన్నీ ఇన్సూర్ చేయబడ్డాయనీ అన్నారు. క్లబ్బులో ముట్టుకొన్న ఈ చిచ్చు అంతటా పాకింది.

ముందుగా శకుంతల వచ్చింది. వస్తూనే కళ్ళంట నీళ్ళు పెట్టుకొంది. తుడుచుకోకుండానే సంచీని పక్కన పెట్టింది.

"ఏమిటిది?" అన్నాడతను.

"మా అమ్మతో దెబ్బలాడి వచ్చేశాను. ఇక నేనా కొంపలోకి అడుగుపెట్టను. ఇంత కాలం నన్ను బొమ్మను ఆడించినట్టు ఆడించింది. ఇక ముందు నేనలా ఆడవలచుకోలేదు. నిన్ను చేసుకొంటే, ఇంటికడప తొక్కనివ్వనన్నది. సరేనంటూ వచ్చేశాను. అన్నది శకుంతల.

"మంచిపనిచేశావు." అన్నాడు ప్రసాదు.

శంకరంకూడా వచ్చాడు. నిన్న నలా మాట్లాడినందుకు క్షమించమన్నాడు. తనవల్ల ఏ సహాయం కావాలన్నా చేస్తానన్నాడు. అదన్నాడు. ఇదన్నాడు. చాలాచాలా అన్నాడు.

అంతా విన్నాక ప్రసాద్ ఒకసారి తనలో తనే నవ్వుకొన్నాడు. ఒక్కసారి వారిద్దరికేసీ చూసి, మునిపంటి పెదవి కొరుక్కున్నాడు.

"మళ్ళా మీరందరూ నాచుట్టూ మూగుతున్నారు. బహుశా ఆ అవకాశం లేనివాడు మా శేషగిరి మావయ్యొక్కడే ననుకొంటాను. ఆయనైనా ఈ ఊళ్ళో ఉండటం జరిగితే తప్పకుండా వస్తాడు మిమ్మల్నిలా రప్పించిందేమిటో నాకు తెలుసు...నన్ను చెప్పనివ్వండి. మీ అభిమానం కానేకాదు. నా డబ్బు అవునా? నిన్న నేను బికారినని తెలిశాక అందరూ దూరంగా తొలిగారు. ఈ రోజున ఇన్సూర్ సంగతి తెలిసి అంతా దగ్గర కొచ్చారు" అన్నాడు ప్రసాద్ చాలా మామూలుగా.

"కాదు" అన్నది శకుంతల.

"నిజంగా ఇప్పటికీ నేను బికారినే; నాకు ఇన్స్యూర్‌లో ఏమీరాలేదు. మీ గుణాలు తెలుసుకొందామని, నేనే ఆ వార్త పుట్టించాను. ఏంచిట్టితల్లీ నన్ను పెళ్ళాడటానికి నువ్వు ఇప్పటికీ సిద్ధంగా ఉన్నావా? నీకు కావలసింది నేనుగానీ, నా డబ్బు కాదుగదా? అయినప్పుడు నీకు అభ్యంతరం ఉండకూడదే మరి?" అన్నాడు ప్రసాద్

"స్టుపిడ్!" అన్నాడు శంకరం కోపంగా

"ఇది మీ నిజస్వరూపం. ఇంతకాలం తెలుసుకోలేకపోయాను. నాకళ్ళు తెరిచారు అందుకు చాలా కృతజ్ఞుణ్ని. అసలు సంగతేమిటంటే, మా ఫాక్టరీలకు ఎటువంటి నష్టమూ రాలేదు అని నిక్షేపంగా పనిచేస్తున్నాయి. ఇప్పటికీ నేను కోటీశ్వరుణ్నే! జపాను యువరాజు, ఓ సామాన్య యువతిని పెళ్ళిచేసుకొన్నట్టు. నేను మా నరుసును పెళ్ళాడబోతున్నాను. కావటానికి పనిమనిషయినా, ఆదిమనిషి, మీరు పశువులు!" అన్నాడు ప్రసాద్ కొంద్రించి ఉమ్మేస్తూ.







పద్మశ్రీ

శ్రీ సి. నరసింహం

ఐ. ఏ. ఎస్.

ప్రస్తుతం భారతదేశంలో జీవన ప్రమాణస్థాయి ధనిక దేశాలకూ, అభివృద్ధి చెందిన దేశాలకు, జాలి,దాతృత్వ భావం కలగజేసే స్థితిలోవుంది. సాంప్రదాయకమైన స్వయంపోషక గ్రామీణ ఆర్థిక వ్యవస్థ క్షీణించడమే ఈ పరిస్థితికి ముఖ్యకారణం. ఇదే సాంఘిక, సాంస్కృతిక పరిస్థితుల తారుమారుకూ హేతువైంది. స్వాతంత్ర్యోదయం తరువాత ఆరోగ్య ప్రదమైన సంపూర్ణ జీవిత సాధనకు ఆకాంక్షరేకెత్తింది. ఈ నాడు సామాన్యవ్యక్తి కూడా ప్రాముఖ్యతలోనికి వస్తున్నాడు. ఉప్పొంగుతున్న ఈ జాతీయాశయాలకు ప్రతిగా స్థానిక సంస్థల అపారమైన శక్తివుంది. స్థానికాభివృద్ధి, జాతీయాభివృద్ధి కృషిలో అత్యధిక బాధ్యతలు వహించడానికై వీటికి ప్రోత్సాహం, మార్గదర్శకత్వం, సాంకేతిక సలహాలు మాత్రమే అవసరం. కర్షకసంస్థ అలాంటి వాటిల్లో ఒకటి.

## కర్షకసంస్థలు-సమాజాభివృద్ధి

సమాజాభివృద్ధి కార్యక్రమాలను కొనసాగించడాన్నీ, విస్తరించడాన్నీ ప్రభుత్వం చేయగలిగినప్పటికీ ఈ ఉద్యమ వికాసానికి అవసరమైన ఉత్తేజాన్ని కలిగించడానికి కర్షక సంస్థల వంటి స్వచ్ఛంద సంస్థలు మాత్రమే చాలావరకు తోడ్పడ గలుగుతాయి. సమాజాభివృద్ధి రంగంలో కర్షక సంస్థలవల్ల ఈ ఉద్యమాభివృద్ధికి మంచి ప్రోత్సాహం లభించడంతో పాటు ప్రయోగ విషయాలపై సమాచారం తెలియ జేసుకోడానికీ చివరకు రాష్ట్రస్థాయిలో విధానాలను రూపొందించడంలో ప్రభుత్వానికి సలహాలివ్వడానికి వీలుండాలి. అత్యధికంగా గ్రామాలతో కూడుకొని ఆర్థికంగా వెనుకబడివున్నటువంటి మన దేశంలో జాతీయ సమాజాభివృద్ధి కార్యక్రమంలో వ్యవసాయ విస్తరణ ముఖ్యమైనది. ఎందుకంటే గ్రామీణ ప్రజల సంక్షేమానికి ఇది అత్యవసరమైనది. బహుళార్థ సాధక కార్యక్రమంగా ఇది విస్తృతమౌతుంది. కర్షక సంస్థల ఆశయాలను చాలవరకు సమాజాభివృద్ధి కార్యక్రమమే నెరవేరుస్తోంది. కాబట్టి ఈ ఉద్యమంపట్ల అవి ఆసక్తి చూపడం సహజం. కర్షక సంస్థలు ప్రత్యేకించి దిగువ విధంగా సమాజాభివృద్ధి ఉద్యమానికి తోడ్పడవచ్చు.

## అధ్యయన పర్యటనల ఏర్పాటు

అభివృద్ధి పథకాలు విజయవంతంగా అమలు జరుగుతున్న పట్టణాలకు లేదా పల్లెలకు గ్రామస్థుల బృందాలను పర్యటనకు తీసుకొని వెళ్లే పద్ధతి ఆచరణలోవుంది. చర్చలకూ, పరిశీలనలకూ, ప్రత్యక్ష ప్రదర్శనకు దీనివల్ల వీలు కలుగుతుంది. విజయవంతమైన సమాజాభివృద్ధి ప్రాజెక్టులను సందర్శించినప్పుడు పర్యటన బృందంవారికి అక్కడ జరిగిన అభివృద్ధిని తాముకూడా సాధించాలన్న ఉత్తేజం కల్గించిన సందర్భాలున్నాయి. కాబట్టి కర్షక సంస్థలు దీనిపై దృష్టిని కేంద్రీకరించి పరిశీలక పర్యటన కార్యక్రమాలను ఏర్పాటు చేస్తూ సంఘసభ్యులను సమాజ బాధ్యతలు వహించడానికి సంసిద్ధులను చెయ్యాలి.

## ప్రత్యక్ష పద్ధతుల ఆచరణ

గ్రామీణాభివృద్ధి కృషిలో ఫలవంతమైన బోధనా పద్ధతిగా ప్రత్యక్ష ప్రదర్శన విధానం అనేక దేశాల్లో అమల్లోవుంది. సమాజాభివృద్ధి ప్రాంతాలలో విస్తరణ నిపుణులు మేలురకం విధానాలను ప్రదర్శిస్తున్నారు. కర్షక సంస్థలు తమ సభ్యులు ఈ విధానాలను ప్రత్యక్షంగా అవలంభించడానికి ప్రోత్సహించాలి. ఎందుకంటే ఎవరైనా విన్న విషయాన్నిగానీ, చూచిన విషయాన్నిగానీ శంకించవచ్చును గాని స్వయంగా చేసినదాన్ని మాత్రం శంకించలేరు.

## సంప్రదింపుల ద్వారా బ్లాకు సిబ్బందితో సహకారం

అనేక ఇతర మానవ కార్య కలాపాలలో వలెనే సమాజాభివృద్ధి రంగంలో కూడా లక్ష్యాలను

బట్టి అవలంభించే సాధనాలను సమర్థించలేము. వ్యక్తులగౌరవాన్నీ, సమభావాన్ని కాపాడడానికీ, స్థానిక ప్రాజెక్టులలో, కార్యక్రమాలలో సాధ్యమైనంత విస్తృత ప్రాతిపదికపై ప్రజలు పాల్గొనేట్లు చేయడానికి తద్వారా సార్వత్రిక సంక్షేమాన్ని, సుఖాన్ని సాధించడానికి తోడ్పడ గలిగినవే విజయవంతమైన మార్గాలు. అంటే ప్రస్తుత సంస్థలు ఐచ్ఛికంగా బ్లాకు సిబ్బందితో సహకరించి వారు తమ సమస్యలను పరిష్కరించడంలో సహాయపడాలి. ఇందుకు బ్లాకు సిబ్బందితో సంప్రదింపులు జరిపే పద్ధతిని నిరంతరం అవలంబించడం అవసరమౌతుంది

## ప్రతి బ్లాకులోనూ ఒక కర్షక సంస్థ ఏర్పాటు

గ్రామీణ అమెరికాలో విస్తరణ కార్యక్రమం ఆదిలోనే సగటు విస్తీర్ణంగల మండలం (కౌంటీ) లో కూడా క్షేత్రాలను సందర్శించడం ద్వారానైతేనేమి, సమావేశాల ద్వారా నైతేనేమి 2 వేల కంటే ఎక్కువమంది రైతులను కలుసుకోడం అసాధ్యమనే విషయాన్ని అక్కడి నాయకులు గుర్తించారు. కాబట్టి స్థానికావసరాలకు సంబంధించి తమకు తెలిసిన విషయాల ఆధారంగా కార్యక్రమాన్ని రూపొందించడానికి కౌంటీ ఏజెంటుతో సహకరించే నిమిత్తం ఒక కర్షకసంస్థ అవసరమనే విషయం స్పష్టపడింది. స్థానిక కార్యక్రమాలను స్థానిక ప్రజల అభీష్టానుసారం వారి అవసరాల కనుగుణంగా రూపొందించడం అవసరం కాబట్టి ప్రతి బ్లాకుకూ ఒక కర్షక సంస్థ వుండడం అవసరం.

## అమెరికా 4-హెచ్ క్లబ్బుల నమూనాలో బాల బాలికల క్లబ్బుల స్థాపన

గ్రామాలలోని మన బాలబాలికలపై ఈ నాడు జాతీయ దృష్టిని కేంద్రీకరింప జేయడం ఎంతైనా అవసరం. ఈ శతాబ్దారంభంలో అమెరికా గ్రామీణ ప్రాంతంకూడా ఇదేవిధమైన పరిస్థితులకు లోనైనది. గ్రామీణ పాఠశాలలు సరిపోవనీ, అవి క్షేత్ర జీవనానికి సంబంధించినవి కావనే భావం ఏర్పడింది. వ్యవసాయం, చేతి కళలలో ప్రత్యక్ష విద్యపట్ల అభిలాష పెరిగింది. సమాజ నిర్మాణంలో నూతన పద్ధతులను ప్రవేశ పెట్టాలనే కోరిక కలిగింది. ఉత్తమ జీవన విధానాలపై కర్షక కుటుంబాలలో ఆసక్తి ప్రబలజొచ్చింది. గ్రామీణ సాంస్కృతిక ప్రమాణాలను మెరుగు పరచడానికి ఉద్యమం తలెత్తింది. యువజనుల అవసరాల విషయంలోనూ, కర్షక యువకులు నగరాలకు వలస వెళ్లడం విషయంలోనూ ఆందోళన ఏర్పడింది. అమెరికా దేశం 4-హెచ్ క్లబ్బులలో ఈ సమస్యలన్నింటికీ పరిష్కారం పొందగలిగింది. ఈ నాడు ప్రతి సంవత్సరం రమారమి 20 లక్షల మంది బాలబాలికలకు ఇవి వర్తిస్తున్నాయి. గృహ జీవితానికీ, సమాజ జీవితానికి సంబంధించిన అనేక జటిల సమస్యలను ఎదుర్కొని వాటిని పరిష్కరించడానికి వారు ప్రయత్నం చేస్తారు. శాస్త్రీయ, సాంఘికావకాశాలను, గుర్తించి స్వతః ప్రతిభను, అవకాశాలను వినియోగించడానికి వారు ప్రయత్నిస్తారు వాస్తవ జీవితంలో పాల్గొనడం ద్వారానూ, సహాయకారి అయిన పనిలో పాల్గొనడం ద్వారాను ఈ యువకులు స్వయం సహాయం, పరుల హక్కుల పరిగణనపై నిర్మితమైన జీవన విధానాన్ని పెంపొందించుకున్నారు ఈనాడు మన దేశంలో యువజనులకొరకు ఇటువంటి సంస్థల అవసరం వుంది కాబట్టి కర్షక సంస్థలు ఇలాంటి సంస్థలను నెలకొల్పడానికి ప్రయత్నించాలి మన రాష్ట్రంలో ఈ విషయంలో కొంత కృషి చేశాం. ఆంధ్రప్రాంతంలో 4-హెచ్ క్లబ్బుల నమూనాలో 1,500 నౌజవాన్ కిసాన్ క్లబ్బులను నెలకొల్పడం జరిగింది. ఇవన్నీ విజయవంతంగానే పనిచేస్తున్నాయని నేను చెప్పలేను. అయితే ఈ రంగంలో మనం కొంత పని ప్రారంభించాం. విజయం లభించ గలదని ఆశిద్దాం.

## కర్షక సంస్థలు-వ్యవసాయాభివృద్ధి

వ్యవసాయాభివృద్ధినీ, తద్వారా ఇతోధిక వ్యవసాయోత్పత్తినీ సాధించవలసిన అవసరం మున్నెన్నడూ లేనంతగా ఈ నాడు ఏర్పడింది. ప్రతి సంవత్సరం సుమారు 50 లక్షల మంది అంటే గంటకు దాదాపు 570 మంది జన్మిస్తున్నారు-అంటే ఉదయం ఫలహారం, మధ్యాహ్న భోజన సమయాల మధ్యకాలంలో ఒక సాధారణ విస్తీర్ణంగల గ్రామం లేదా పట్టణంలో నివసించేటంత జనాభా ఏర్పడతోందన్నమాట. కాబట్టి వారి ప్రాథమిక అవసరమైన ఆహార సమస్యను పరిష్కరించడానికి మనం మొట్టమొదట ప్రయత్నించాలి. ఇంతేగాక మొత్తం ఆర్థిక పరిస్థితిలో వచ్చే మార్పువల్ల ఏర్పడే అవసరాలను తీర్చడానికి గ్రామీణ వ్యవసాయక రంగంలో ఇతోధికంగా ఉత్పత్తిని సాధించడం అవసరం. వ్యవసాయం గ్రామీణ తదితరఆదాయాలలో వ్యత్యాసంపెరగకుండా జాగ్రత్త వహించాలి. పోతే మన ఎగుమతులను పెంపొందించి విలువైన విదేశ మారకాన్ని ఆర్జించడంద్వారా విదేశ వ్యాపారాన్ని నిర్వహించవలసిన అవసరం వుంది. మామూలు శాస్త్రీయ వ్యవ

సాయ పద్ధతుల ద్వారానే కాకుండా కర్షక సంస్థలు వ్యవసాయాభి వృద్ధికి, అధికాహారోత్పత్తికి దిగువ విధానాల ద్వారా తోడ్పడ వచ్చు.

## ఉత్పత్తి సంఘాలు

తలపెట్టిన ఉన్నత వ్యవసాయోత్పత్తి లక్ష్యాలను సాధించ డంలో దేశానికి తోడ్పడే నిమిత్తం ప్రతి కర్షక సంఘం కూడా ఒక చిన్న ఉత్పత్తి సంఘాన్ని నెలకొల్పాలి. ఈ సంఘం తాను పని చేసే ప్రాంతానికి ఖచ్చితమైన ఉత్పత్తి లక్ష్యాలను నిర్ణయించి వాటిని సాధించేందుకు కృషి చెయ్యాలి.

## పరిశోధన కార్యకర్తలు-కర్షకులు

చైనాలో పరిశోధన సంస్థలు భూమితో ఎక్కువ సంబంధం కలిగివుంటాయి. రైతులదైనందిన వ్యవహారాలతో వాటికి సన్ని హిత సంబంధం వుంటుంది. చైనాను సందర్శించిన భారత ప్రతి నిధివర్గం, చైనాలో పరిశోధన కార్యకర్త, విస్తరణ కార్యకర్తల మధ్య వుండే సంబంధం, పరిశోధన కార్యకర్తకు రైతుతో వుండే సన్నిహిత సంబంధం భారతదేశంలో కూడా ఏర్పడాలని అభి ప్రాయ పడింది. పరిశోధన సంస్థల కార్యకర్తలచేత తమ స్వంత స్థానిక సమస్యలను పరిష్కరింప జేయడానికి కర్షక సంస్థలు ప్రయత్నం చేయాలి. ఆయా పరిశోధక సంస్థలు, కర్షక సంస్థలు ఈ పని సాధించే విధానాన్ని వివరంగా రూపొందించాలి.

## బలమైన సహకార వ్యవస్థ

వ్యవసాయాభివృద్ధికి సహకారోద్యమం ప్రధానం. వ్యవ సాయ సహకార పరపతి సంఘాలు, సరఫరా సంఘాలు, మార్కె టింగ్ సంఘాల స్థాపనే కర్షక సంస్థల ప్రధాన కర్తవ్యమైవుండాలి. చైనాలో వ్యవసాయాభివృద్ధి పథకంలో సహకార సంఘాలస్థాపన కీలకస్థానం వహిస్తోంది. వర్తకులనూ వడ్డీ వ్యాపారులను తొల గించి వ్యవసాయోత్పత్తిదారుల సహకార సంఘాలను నెలకొల్ప డం అత్యవసరం. సహకార సంఘాల అభివృద్ధివల్ల స్త్రీ పురుషు లలో బాధ్యతలపట్ల, నాయకత్వంపట్ల అభిలాష పెరుగుతుంది. మొత్తం సమాజానికి ప్రయోజనం కలిగే విధంగా గ్రామాలలో ప్రజా శక్తిని కేంద్రీకరింప జేయడానికి కూడా అందువల్ల వీలు కలుగుతుంది. గ్రామీణాభివృద్ధికై భవిష్యత్ ప్రణాళికలను అమలు పరచడంలో ప్రభుత్వానికి చాలా సహాయకారులుగా కూడా అవి వుండగలుగుతాయి.

## సహకార వ్యవసాయం.

వివిధ రకాల సహకార వ్యవసాయంలో కర్షక సంస్థలు ప్రయోగ కార్యక్రమాలను ధైర్యంగా ప్రారంభించాలి. సహకార క్షేత్రాలలో మానవశక్తి నంతటినీ సమీకరించడం, పనిని బట్టి ప్రతి ఫలం నిర్ణయించడంవల్ల సోమరిపోతులు కూడా ఒళ్లువంచి గట్టిగా పనిచేయవలసి వస్తుంది. చైనాలో సహకార వ్యవసాయ క్షేత్రాలను స్థాపించడంవల్ల, గ్రామీణ ప్రాంతాల్లోని సహజ వనరులనూ, మానవ శక్తిని అత్యంత సమర్థంగా వినియోగంలోకి తేవడానికి వీలు కలిగింది. సహకార వ్యవసాయంవల్ల అక్కడ వ్యవసాయో త్పత్తి 15 నుండి 20 శాతానికి పెరగ గలిగింది. మన దేశంలో కూడా సహకార వ్యవసాయాన్ని ప్రారంభించడానికి తగిన ప్రోత్సాహ కారణం కావాలి. ప్రాథమిక అవసరాలైన ఆహారం, వస్త్రం, నివాస వసతులను సమకూర్చే ప్రజాస్వామిక సమాజాన్ని స్థాపించా లంటే కర్షక సంస్థలకు గురుతరమైన పాత్రవుండాలి. లేకీ మూరిస్ చెప్పినట్లు ప్రాథమిక భౌతికావసరాలు తీరడమే ఉత్తమ జీవితానికి నాంది. చాలమంది ప్రజలు వీటి సాధనలోనే నిమగ్నులు కావటం వల్ల మిగిలినవేమీ పొందలేక జీవితాన్ని గడుపుతున్నారు.

నికృష్టమైన దారిద్ర్యంవల్ల కుటుంబ వాత్సల్యం నశిస్తుంది, సాంస్కృతిక అవకాశాలు వ్యర్థమౌతాయి. ప్రాథమిక అవసరాలు తీరగలవనే హామీద్వారా పేదరికంవల్ల కలిగిన భయాన్ని పోగొట్టి నట్లయితే మానవుడు ఇతర విషయాలను గురించి జీవితంలో కొద్దికాలమైనా స్వేచ్ఛగా ఆలోచించ గలుగుతాడు. ప్రజలకు ఉత్తమ జీవనావకాశాలను కలుగజేయడానికి కర్షక సంస్థలు గణ నీయమైన పాత్ర వహించడంలో సందేహంలేదు. ఐతే ఇందుకు ఓరిమి, నిరంతర కృషి అవసరం. కర్షకసంస్థలు, ప్రతిరైతునూ తమ గ్రామంలోగల ప్రముఖ పురోగామి అయిన రైతును అనుస రించవలసిందనీ, అతనితో సన్నిహితంగా మెలగవలసిందనీ, కలిసి అభ్యుదయ మార్గాన పురోగమించవలసిందనీ ప్రోత్సహించ గల్గి నట్లయితే సాధ్యమైనంత స్వల్పవ్యవధిలోనే ఉత్తమ ఫలితాలను సాధించే అవకాశాలు విశేషంగా వుంటాయి.

(ఆంగ్ల వ్యాసానికి అనువాదం)

ఈ ప్రణాళికద్వారా మీకు కలిగే ప్రయోజనాలు

# ఇతోధికమైన ఉద్యోగ అవకాశాలు



మూడవ పంచవర్ష ప్రణాళిక
అదనపు ఉద్యోగావకాశాలను కలుగజేస్తుంది.

- సాంద్ర వ్యవసాయపద్ధతి ద్వారానూ, అదనముగా భూమిని సాగులోనికి తీసుకొనిరావడం ద్వారానూ వ్యవసాయ రంగములో అదనముగా 35 లక్షలమందికి వృత్తి సౌకర్యాలు కల్పింప బడతాయి.
- పరిశ్రమలు. రవాణా, వాణిజ్య రంగాలలోను; సంఘసేవ. ప్రభుత్వ శాఖలలోను అదనముగా 105 లక్షలమందికి ఉద్యోగావకాశాలు కల్పింపబడతాయి.

అంటే
ఉద్యోగానికి. ఉజ్జ్వల భవిష్యత్తుకి
మీకు నూతన అవకాశాలు లభిస్తాయన్నమాట.

ప్రణాళిక విజయానికి తోడ్పడండి - తద్వారా

మూడవ
పంచవర్ష
ప్రణాళిక

**ప్రతి ఒక్కరికీ ఆనందదాయకమైన జీవితం**

DA 61/761

# విద్యుచ్ఛక్తి సరఫరా

విశాఖపట్నం జిల్లా బిళ్లలవలస, తూర్పు గోదావరి జిల్లా విజయరాయుడు పాలెం గ్రామాలు గత ఫిబ్రవరి నెలలో విద్యుత్ సౌకర్యాలు పొందాయి.

ఇదే నెలలో కడప జిల్లాలోని దిగువ గ్రామాలకు విద్యుత్ సరఫరా జరిగింది:— కొత్తపల్లె, చెరుమీదిరాచపల్లె, నేతివారిపల్లె, వెంకటరాజుపల్లె, పందేటివారిపల్లె, శేషన్నగారి పల్లె, కమ్మపల్లె, గుడ్లవారి పల్లె, చల్లంపేట, వెంకట నారాయణపల్లె, వడ్డపల్లె, (రాజంపేట తాలూకా గ్రామాలు); వీరపల్లె, బలతనిపల్లె, పాలు గారిపల్లె, కొత్తపల్లె, (రాయచోటి తాలూకా గ్రామాలు)

ఈ నెలలోనే ఈ క్రింద పేర్కొన్న గ్రామాలకుకూడా విద్యుచ్ఛక్తిని సరఫరా చేయడం జరిగింది:—

కొంగనపాడు, రేమాట, సలకపురం, నిడుజూరు, ఉలిచల.

అనంతపురం జిల్లాలో ఈ నెలలో దిగువ గ్రామాలకు విద్యుత్ సౌకర్యాలను విస్తరింప జేశారు:— కరకముక్కల, (గుత్తి తాలూకా), తనకల్లు (కదిరి తాలూకా) కొత్తపల్లె (గుత్తి తాలూకా) జనార్దన పల్లె (గుత్తి తాలూకా)

చిత్తూరు జిల్లాలోని చిటిపిరాళ్ల, సంజీవరాయని పల్లెలకు కూడా ఈ నెలలోనే విద్యుత్ సౌకర్యాలను కలుగజేశారు.

1962 ఫిబ్రవరిలో తెలంగాణా ప్రాంతంలో దిగువ గ్రామాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేశారు:—

| గ్రామం | తాలూకా | జిల్లా |
|---|---|---|
| సిరిపల్లి | నల్గొండ | నల్గొండ |
| గంగాపూర్ | మహబూబ్‌నగరం | మహబూబ్‌నగరం |
| మనదేవపురం | మధిర | ఖమ్మం |
| ఇల్లూరు | మధిర | ఖమ్మం |
| తాడిల్లగూడెం | మహబూబాబాద్ | వరంగల్ |
| కలుకోవ | హుజూర్‌నగర్ | నల్గొండ |
| రాంపల్లి | సుల్తానాబాద్ | కరీంనగరం |
| తిమ్మాపూరం | కరీంనగరం | ,, |
| మహమ్మదాపూర్ | రామన్నపేట | నల్గొండ |
| ఏదులగూడ | ,, | ,, |
| కాసరపల్లి | సుల్తానాబాదు | కరీంనగరం |
| చౌదరపల్లి | వనపర్తి | మహబూబ్‌నగరం |
| గుడపూర్ | నల్గొండ | నల్గొండ |
| ఖాన్‌పూర్ | చేవెళ్ల | హైదరాబాదు |
| జొనవాడ | ,, | ,, |
| మోహిల | ,, | ,, |
| సుర్జాపూర్ | ఖానాపూర్ | ఆదిలాబాదు |
| దుబ్బాక | సిద్దిపేట | మెదక్ |
| ధర్మారం | ,, | ,, |
| హబ్షీపూర్ | ,, | ,, |
| నాసారం | ,, | ,, |
| నెల్లుల | మహబూబాబాద్ | వరంగల్ |



ఈ సృష్టి ఎచ్చటనుండి ఎట్లు జరుగుచున్నది? మనము ఎద్దానినుండి ప్రభవించుచున్నాము? అని సృష్టి విషయకమగు ప్రశ్నలు వేదములో పలు తావుల తలసూపినవి. వానికి తగిన సమాధానములు పలువురచే పలు విధముల ఒసగబడినవి. వేదములు, ఉపనిషత్తులు, దర్శనములు, ఈ సృష్టి తత్త్వమును గూర్చియు, ఇందలి "నేను"ను గూర్చియు, నేనను వానికి గావలసిన పరమార్థమును గూర్చియు బహుథాప్రవహించినవి. తత్ప్రవచన మార్గములు నానావిధముల విస్తరించినవి. దర్శనములు పెక్కులు. అందు ముఖ్యభూతములయిన షడ్దర్శనములనినారు, వానిలో సాంఖ్యదర్శన సిద్ధాంతములను గూర్చి ఈ వ్యాసమున సంగ్రహముగా దెలిసికొందుము




ఈ దర్శనము కపిల మహర్షిచే రచింపబడినది. గావున "కాపిల" మనియు, తత్త్వములసంఖ్యను ఇరువది యైదని చెప్పుచున్నది గావున "సాంఖ్య" మనియు పిలువబడుచున్నది. ఈ దర్శన ప్రవర్తకులను, తదనుయాయులను సాంఖ్యులందురు భగవద్గీతలో సాంఖ్యశబ్దము జ్ఞాన పర్యాయముగా ప్రయోగింపబడినది. సాంఖ్య మతమున ప్రత్యక్షము, అనుమానము, శబ్దము అని ప్రమాణములు మూడు. ప్రకృతి, పురుషుడు (ఆత్మ) అని ముఖ్య తత్త్వములు రెండు అందు ప్రకృతి తన వికారములైన మహదాదులతో గూడి ఇరువది నాలుగు కాగా, వానితో పురుషుడును గూడుకొన మొత్తమున కిరువదియైదు తత్త్వములగుచున్నవి పురుషుని వదలినచో తక్కిన వానిని చతుర్వింశతి తత్త్వములనుచున్నారు. పంచవింశకుడు పురుషుడు. మనకనుష్ఠేయమైన గాయత్రీమంత్రములోని ఇరువది నాలుగక్షరములును ఈ చతుర్వింశతి తత్త్వములనే సూచించుచున్నవి. ఏతత్పంచవింశతి తత్త్వమహ స్వరూపమే స్థూల సూక్ష్మకారణ దేహములతో గూడిన జీవాత్ముడు. ఈయంశమునే పోతులూరి వీరబ్రహ్మముగారు "పంచవింశతి తత్త్వభావము తానయ్యా" అని ఒక తత్త్వములో సర్వజన సులభముగా చాటియున్నారు.

## ప్రకృతి

సత్త్వము, రజస్సు, తమము అను మూడుగుణములే స్వరూపముగా గలది ప్రకృతి. కావుననే దానిని త్రిగుణాత్మకమన్నారు. ఇది పురుషునివలె నిత్యమైనదే. కుండకుమన్ను ఉపాదాన కారణమైనట్లు జగత్తునకు ప్రకృతి ఉపాదానకారణము మట్టియందు కుండగా పరిణమించుశక్తి గర్భితమైయున్నట్లే ప్రకృతియందును జగమును బుట్టించుశక్తి స్వతంత్రముగానున్నది. ఈ ప్రకృతియందు సత్వరజస్తమములను మూడు గుణములు సమానముగానుండునవస్థను గుణసామ్యావస్థయందురు. ప్రకృతియందలి ఈ మూడు గుణముల వైషమ్యముచేత సృష్టి ప్రారంభమగును.

మూల ప్రకృతి, లేక ప్రధానము అను పేరులతో నొప్పు నీ ప్రకృతి స్వయముగా పరిణమించు స్వభావము కలది గావున కర్తృత్వమే స్వరూపముగా గలదైయున్నది. ఈ ప్రకృతి సుసూక్ష్మమగుటచేత గోచరించునదికాదు అట్టి దశయందు దాని నవ్యక్తమందురు. అట్టిది స్థూలమై జగదాకారమున గోచరించునప్పుడు వ్యక్తమనబడుచున్నది. ప్రకృతియందలి త్రిగుణముల వైషమ్యముచేత సృష్టి కలుగునని చెప్పుకొంటిమి. ఆ సృష్టిక్రమమును సాంఖ్యులీ రీతిగా వర్ణించియున్నారు. ప్రకృతి నుండి మహత్తత్త్వము పుట్టును. ఇదియే బుద్ధి అనబడుచున్నది దీని నుండి అభిమానమనెడి అహంకారము కలుగును. ఆ అహంకారమునుండి పంచతన్మాత్రలు (సూక్ష్మపంచ మహాభూతములు) పుట్టును. ఈ ఎనిమిదింటిని అష్ట ప్రకృతులందురు. భగవద్గీతలో ఏడవ అధ్యాయమున–

"భూమిరాపో ఽనలో వాయుః
ఖంమనోబుద్ధి రేవ చ
అహంకార ఇతీయం మే
భిన్నా ప్రకృతిరష్టధా."

అని చెప్పబడిన అష్టప్రకృతులివియే. వీనిలో అవ్యక్త మహదహంకారములు మూడును అగోచరములు, పంచమహాభూతములు గోచరములు. ఈ ఎనిమిది తత్వములే అష్టదళ పద్మముగా సంభావితములైనవి. మన హిందూమతములోని నానా

దేవతలకు అష్టదళ పద్మమాసనమనుట సుప్రసిద్ధము. అష్టాత్మకముగా నున్న ఈ ప్రకృతి నధిష్టించియే ఆత్మ స్వరూపులగు నా యా దేవతలు విహరింతురనుట ఇచ్చట పరమార్థము. గహనమగు భారతీయ వేదాన్తములోని మహారహస్యములిట్టివి. వానిని భావన చేసి పరమార్థమును బడసినచో నానాత్వముగాని, విప్రతిపత్తులు గాని సిద్ధముకావు.

పైని పేర్కొన్న పంచతన్మాత్రల యొక్క సాత్వికాంశములచేత జ్ఞానేంద్రియ పంచకమును మనస్సును సృష్టములగుచున్నవి. రజోగుణాంశములచేత కర్మేంద్రియ పంచకమును, పంచప్రాణములను పుట్టుచున్నవి. పంచీకృతములైన తమోగుణాంశములచేత స్థూల పంచమహాభూతములుద్భవించినవి. ఏకాదశేంద్రియములను (కర్మజ్ఞానేంద్రియములు పది అంతఃకరణ మొకటి) పంచమహాభూతములను గలిపి షోడశవికారములందురు. ఇట్టి తమోమయ పంచమహాభూతములచేత దృశ్యమానమగు జగత్తును, అన్నాది క్రమమున స్థూల దేహమును ఏర్పడినవి. ఏకాదశేంద్రియములు, బుద్ధి, శబ్దస్పర్శ రూప రసగంధములను పంచతన్మాత్రలు మొత్తము పదునేడింటి చేత సూక్ష్మ (లింగ) శరీరమేర్పడి జీవుని పుణ్యపాప రూపకర్మ వాసనలకాకరమై అనాదిగా పురుషునాశ్రయించి యుండును. పంచీకృతమగు స్థూల పంచమహాభూతముల పరిణామమైన స్థూలదేహములు ప్రాణుల గుణకర్మలకు దగినట్లు వచ్చుచు పోవుచునుండును. సూక్ష్మ శరీరము మాత్రము మోక్షకాలమున నివర్తించునే గాని ఈ మధ్య నివర్తింపదు.

## పురుషుడు

చిత్ర విచిత్ర వస్తువులతో గూడినదియు, ప్రకృతి పరిణామభూతమైనదియు భోగ్యమైనదియునగు నీ జగత్తు నధిష్ఠించి దానిననుభవించు భోక్తయొకడు గావలయును. అట్టి పురుషుడే ఆత్మ. ఈ పురుషుడు ప్రకృతివలె ఒక్కడా, పలువురా ? ఒక్కడేయైన యెడల లోకమునందలి పురుష (జీవు) లందఱు నొక్కటే కావలయును. అట్లయిన ఒకనికి గలుగు జనన మరణాదులు సమకాలమున తక్కిన వారికిని గలుగవలయును. అట్లు కాక పలు జీవుల యందు పలు భేదములు కానవచ్చుట చేత పురుషులనేకులై యుండవలయునని సాంఖ్యమతము సిద్ధాంతీకరించుచున్నది. ఈ పురుష (ఆత్మ) నానాత్వ సిద్ధాంతము అద్వైతులకు తక్క పెక్కు మతముల వారికిష్టమే.

ఈ పురుషుడు అనగా ఆత్మ, చైతన్య మాత్ర స్వరూపుడు, నిష్క్రియుడు, నిర్వికారుడును. ఇట్లు పురుషుడు నిత్య నిర్వికార చైతన్య మాత్రుడగుటచేత వాడు దేనికిని కర్తగాని, భోక్త గాని కాడు. దేని చేతను బద్ధుడును గాడు ఈతని దర్శన మాత్రము చేత ప్రకృతి ప్రవర్తించుచుండును. సాంఖ్యములోని ఈ ప్రకృతి పురుషతత్త్వములను రెంటిని గూర్చి భగవద్గీత పదుమూడవ యధ్యాయమున-

"ప్రకృతిం పురుషం చైన విద్ధ్య నాదీ ఉభావపి
వికారాంశ్చగుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్."

అని (ప్రకృతి పురుషతత్త్వములు) రెండును అనాది సిద్ధములని వాకొన్నది. గుణములును వికారములును ప్రకృతి సంభవములనుటలో ఎవ్వరికిని విప్రతిపత్తి లేదు.

## బంధము

ఇట్టి పురుషుడు ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికములను తాపత్రయమునకు లోబడి యుండుటయే బంధము. ఈ బంధమునకు కారణము పురుషుడు ప్రకృతి గుణములను, వికారములను తనవని భ్రాంతిచెందుటయే. పురుషుడు తాను ప్రకృతికంటెను వేరయినవాడయ్యును ఆ ప్రకృతినే తన్నుగా భ్రమించుచున్నాడు. ఈ ప్రకృతి పురుష భేదమును గ్రహింపకపోవుటయే-అనగా అభేదభ్రమయే బంధహేతువు ఈ అంశము గీతలలో పలుతావుల విస్పష్టము చేయబడియున్నది

"ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః
అహంకార విమూఢాత్మా కర్తాహమితి మన్యతే "

ప్రకృతి గుణములచేతనే అన్ని పనులును జరుగుచున్నవి. ప్రకృతి యొక్క గుణ వికారములయందహంకారమును పూని అజ్ఞాని తాను కర్తననుకొనుచున్నాడు. ప్రకృతి పురుష వివేకమున్న నీయహంకారము కలుగదు అప్పుడు బంధముండదు.

కైవల్య స్వరూపుడైన పురుషునకు యధార్థముగా బంధము లేదు. అది భ్రాంతి కల్పితమే గాని సత్యము కాదు. పురుషునికి ప్రకృతి తోడ సంబంధము కలిగినప్పుడు, ప్రకృతి వికారమైన బుద్ధి తత్త్వము, స్ఫటికమునందు జపాపుష్పపు టెఱ్ఱదనమువలె పురుషుని చైతన్యమునందు ప్రతిఫలింపగా వానికి భేదమును గ్రహింపలేని స్థితి కలిగి బుద్ధి ప్రవృత్తుల నన్నింటిని తాను అనుక

రించుచున్నాడు. ఇట్లు తనయందు ప్రతిఫలించిన బుద్ధియొక్క తాపత్రయమును తనదిగా భావించి అనుభవించుచున్నాడు ఈ తాపత్రయానుభవ రూపమైన బంధము యథార్థము గాక భ్రమాత్మకమగుటచే పురుషుని కైవల్య స్వరూపమునకు బాధలేదు. ఈ భ్రాంతికి కారణము ప్రకృతి పురుష వివేకాభావము.

ప్రకృతి పురుషుల ఈ సంబంధము దర్శనరూపమైనది. ఈ దర్శనమే ఆత్మకు భోగము. నిర్వ్యాపారమైన అయస్కాంత సన్నిధియందు ఇనుప ముక్కకు చలనముకలిగినట్లే, పురుష సన్నిధియందు ప్రకృతి మహదాద్యాకారముగా పరిణమించును. అప్పుడు బుద్ధియందు పురుష చైతన్యము ప్రతిఫలించి సంబంధము కలిగి ప్రకృతియొక్క కర్తృత్వము అకర్తయగు పురుషునందును. పురుషుని చైతన్యము అచేతనమగు ప్రకృతియందును ఆరోపితము లగుచున్నవి. పరస్పర గుణారోప రూపమగు ఈ యధ్యాసమే బంధము.

## మోక్షము

ఇరువదినాలుగు తత్వములతో గూడుకొన్న ప్రకృతి యొక్కయు-పురుషుని యొక్కయు పరిజ్ఞానమే మోక్ష హేతువు. భజనసేవనాదులు అర్చనీయుడుగు పరమేశ్వరుడు లేనందున సంభవింపవు. కర్మలందుమా॥ తత్ఫలము నశించునట్టిది కావున అనుష్ఠేయములు కావు. ఏ ప్రకృతి పురుష వివేకము లేకపోవుట చేత ఈ బంధము కలిగెనో, ఆ ప్రకృతి పురుషుల వివేకము (జ్ఞానము) చేతనే ఆత్మజ్ఞానముదయించి తాపత్రయ దుఃఖములు చల్లారి బంధ విముక్తి చేకూరును.

"అథత్రివిధ దుఃఖ అత్యన్తికనివృత్తి
రత్యన్త పురుషార్థః"
అని సాంఖ్య దర్శన సూత్రము.

మోక్షహేతువైన ఈ ప్రకృతి పురుష వివేకము యోగముచే గలుగును ఈ యోగమును గూర్చి యోగదర్శనము చెప్పును. పురుషునికి మోక్షము కలుగగా అతనిని ప్రకృతి వదలిపెట్టును. ప్రకృతి పురుష వివేకము లేక పరస్పరాధ్యాసచే బాధపడువారికై ప్రకృతి ప్రవర్తించి వారికి వివేకము కలుగగనే తద్విషయమున వివర్తించునని సాంఖ్యదర్శన సిద్ధాంతము

ఈ దర్శనమునందీశ్వరతత్త్వములేదు. ప్రధానమే స్వతంత్రమై సృష్టిచేయజాలియుండగా ఇంక ఈశ్వరుడేం? ఈశ్వరుడే సృష్టి యొనర్చునేని. అతడు సృష్టి చేయవలయునను కోరిక గల వాడగును. కాన రాగాత్మకరజోగుణబద్ధుడు కావలసి వచ్చును. మఱియు కర్మములే ఫలములిచ్చుటకు సమర్థములై యున్నవి. ఈశ్వరుడొకడుండిన యెడల కర్మల ననుసరించియే ఏదియైన నొసంగవలసి యుండును. కాన అట్టి అస్వతంత్రుని ఉనికిచే ప్రయోజనమేమని ఈ దర్శనము సిద్ధాంతీకరించుచున్నది. సర్వ సృష్టియు పురుషసన్నిధి మాత్రము చేత ప్రకృతియే చేయుచున్నదని నిరూపింపబడియుండుట చేత జగత్సృష్టికొరకు సృష్టికర్త యవసరములేదు.

సారాంశము : ప్రకృతి పురుషులు అనాది సిద్ధ పదార్థములు. పురుషసన్నిధి మాత్రమున ప్రకృతియే జగదాకారముగా పరిణమించుచున్నది. ప్రకృతి పురుష వివేకాభావమే బంధము. సంసారము. అదితాపత్రయానుభవ స్వరూపము. ప్రకృతి పురుష భేద పరిజ్ఞానము మోక్ష హేతువు. త్రివిధ దుఃఖ అత్యంతిక నివృత్తి పూర్వక కేవలాత్మ స్వరూప స్థితి మోక్ష స్వరూపము.

## గమనిక

గత నెల ఆంధ్ర ప్రదేశ్ పంచభూతాలు కథలో (16వ పుటలో) మూడవ భూతం చెప్పిన కథ అని అన్నదానిని "రెండవ భూతం చెప్పిన కథ"గా చదువుకొన గోరుతున్నాము.

# విశేషాలు

అఖిల భారత చెరకుపంట పోటీలో బొబ్బిలి కుమార రాజాకు రూ. 2,500 ల ప్రథమ బహుమతి, అఖిలభారత స్థాయిలో ఒక సువర్ణ పతకం, రాష్ట్ర బహుమతిగా రూ 500 లు లభించాయి. ఎకరానికి 128.27 టన్నుల చెరకును పండించినందుకు వీరికి బహుమతులు వచ్చాయి.

కేంద్ర చెరకుపంటల పోటీ ఉపసంఘం ప్రకటించిన ఈ బహుమతులలో ద్వితీయ బహుమతి పూనాకు చెందిన శ్రీ ఆనంద రామచంద్ర గాదేకు, తృతీయ బహుమతి కృష్ణాజిల్లాకు చెందిన శ్రీ వై. వెంకటాచలం గారికి వచ్చింది.

* * *

## ఇండియన్ ఆయిల్ కంపెనీ డిపోలు

ప్రభుత్వ యాజమాన్యానగల ఇండియన్ ఆయిల్ కంపెనీ తయారుచేసిన ఒక పథకంలో భాగంగా ఆంధ్రప్రదేశ్‌లో 5 పెట్రోలియం నిల్వల డిపోలు నిర్మింపబడనున్నాయి వచ్చే ఆరు నెలల లోపల దక్షిణ భారతదేశంలో 14 నిల్వల డిపోల నిర్మాణం జరగాలని ఈ పథకం తెల్పుతున్నది. వీటిలో రెండు డిపోలు మైసూరు రాష్ట్రంలోను, రెండు డిపోలు మద్రాసు రాష్ట్రంలోనూ, 5 డిపోలు కేరళ రాష్ట్రంలోనూ వుంటాయి. ఈ డిపోలు పెట్రోలు, కిరోసిన్, డిసెల్ ఆయిల్, ఇంకా ఇతర పెట్రోలియం ఉత్పత్తులను సరఫరా చేస్తాయి.

* * *

## తెలుగు చలన చిత్రానికి బహుమతి

1961 సంవత్సరానికి రాష్ట్రపతి రజిత పతకాలనందుకున్న చలనచిత్రాలలో "భార్యాభర్తలు" తెలుగు చిత్రం వున్నది.

* * *

## సేవా పరాయణత్వం

గత సంవత్సరం అక్టోబర్ 20 వ తేదీన హౌరా-రాంచీ ఎక్స్‌ప్రెస్ రైలు ఘాట్శిలా అనేచోట పట్టాలుతప్పి ప్రమాదానికి గురియైన సందర్భంలో, ఇతరుల ప్రాణాలను రక్షించే యత్నంలో తన ప్రాణాలనే కోల్పోయిన ఆ రైలు డ్రైవరు శ్రీ అల్లిక వెంకటరావుకు (ఆగ్నేయ రైల్వే) రైల్వే వారోత్సవాల సందర్భంగా ఏప్రిల్ 11వ తేదీన బొంబాయిలో జరిగిన ప్రత్యేకోత్సవంలో-రైల్వేల మంత్రి సర్దార్ స్వరన్‌సింగ్ ఒక బహుమతి నిచ్చారు. ప్రశంసనీయమైన సేవ చేసిన 18 మందికి ఈ బహుమతుల నిచ్చారు.

జి. టి. ఎక్స్‌ప్రెస్ ప్రమాద సమయంలో ఫైర్ మెన్‌ను, ఇతరులను ఇంజనునుంచి బయటకి దూక వలసిందని శ్రీ వెంకటరావు చెప్పారు, కాని తానుమాత్రం ధైర్యంగా తన పనిలో నిమగ్నులైవుండి బ్రేకులను గట్టిగా పట్టుకొని ప్రమాద తీవ్రతను తగ్గించడానికి యత్నంచేశారు. తరువాత తుత్తునియలైన ఇంజను నుంచి ఆయన శవాన్ని బయటకు తీసేవరకూ ఆయన చేతులు బ్రేక్ లెవర్‌ను గట్టిగా పట్టుకునే వున్నాయి.

ఈ బహుమతిని శ్రీమతి వెంకటరావు స్వీకరించారు.



నాటిక:

# పండిన బీళ్లు

శ్రీ మిక్కిలి సుందరరావు

## పాత్రలు

| | | | |
|---|---|---|---|
| పరంధామయ్య | — ధనికుడు | కోటిగాడు | — పరంధామయ్య ఇంటి కాపలాదారు |
| గోపాలం | — పరంధామయ్య కుమారుడు | ధర్మయ్య | — పేదరైతు |
| చుక్కయ్య | — పరంధామయ్య ఇంటి నౌకరు | రాధ | — ధర్మయ్య కూతురు |

### 1 వ రంగం

తెరలేచే సరికి పరంధామయ్య గారి భవనం మధ్యలోని ఒక పెద్దహాలు. హాలునుండి బయటకు వెళ్లడానికి మార్గంలోపలికి వెళ్ల డానికి మరొక మార్గం వున్నాయి. హాల్లో గాంధీమహాత్ముని ఫోటో, కీర్తిశేషురాలైన ఆయింటి యిల్లాలి ఫొటో వున్నాయి—ఒక వైపు ఓబల్లా, ఓరెండు సోఫాలు—కుర్చీలు వున్నాయి.

చుక్కయ్య: (హుషారుగా ప్రవేశించి, సోఫాలు తుడుస్తూ)

నాయుడోళ్లింటికాడ
నల్లతుమ్మచెట్టుకాడ
నాయుదేమన్నాడెబుల్లో
అబ్బ!
నావళ్లు జల్లుమన్నాదేలమ్మో

కోటిగాడు: (ప్రవేశం) పాడరాపాడు—ఆపావేం—హోరి నేతస్సాడియ్యా—మా జోరుగా వుందే యవ్వారం—ఏమిటీకథ?

చుక్కయ్య: అయితే యేమిటిరా నువ్వనేది? నన్ను పాటపాడుకో వద్దంటావు—అంతేనా?

కోటిగాడు: మా వుషారుగా ఉన్నావులే—

చుక్కయ్య: నాకేంరా—కష్టపడి పనిచేస్తాను. కడుపునిండా తింటాను. ఏ చెట్టునీడనో పడుకుంటాను— నాకేందిగులురా—నీలాంటి రౌడీవెధవలకే—దిగులూ—విచారం.

కోటిగాడు: నీకేంరా మారాజువి!—అయ్యగారు యెటుపోయెందురా—

చుక్కయ్య: ఒరేయ్ కోటిగా—ఇయ్యాలనుంచి నీ ఆటలేమీ సాగవ్—జర్మనీనుంచి చినబాబు గోరువస్తున్నారు. ఇకనువ్వు జాగ్రత్తగా ఉండటంమంచిది.

కోటిగాడు: అమ్మో, గోపాలంబాబు, జర్మనీనుంచి వస్తున్నారన్న మాట!

చుక్కయ్య: ఆఁ—మరి ఏమనుకుంటున్నావ్—అందుకేగా నేను యిల్లంతా అద్దంలాగా చేశాను.

కోటిగాడు: గోపాలంబాబు, మాదొడ్డ మనిషిరా.

చుక్కయ్య: ఆయన వూళ్లోవుండాడంటే, దొంగవెధవ లందరికీ గుండెలు దడదడమంటాయి (కొంచెమాగి) ఈ సారి బాబుగోరు సర్కారుపనిమీద పోయారు జర్మనీకి.

కోటిగాడు: అలాగా—ఎందుకని?

చుక్కయ్య: దేశంలో ప్రజలంతా సమానులేననీ— బీదాబిక్కా వుండ కూడదనీ—అలా చెయ్యాలంటే—విదేశాల్లో పద్ధతులు ఎలా వున్నాయో చూచిరావడానికి అయ్యగోరుని జర్మనీ పంపారు ఆదేశాల్లో యగసాయం యెలా చేస్తున్నారో— మన దేశంలోకూడా అలాగే చెయ్యాలని బాబు గారిని పంపారు,

కోటిగాడు: అదికాదు చుక్కయ్యా—నాకు తెలియకడుగుతా—ఈ నర్కారోళ్లు యెంత కష్టపడితే మాత్రం బీదోళ్లు మారాజు లౌతారాంట?

చుక్కయ్య: అట్టాగే చూస్తావుండు—ఇయ్యాల నువ్వు అయ్యగోరి టికి నేరుగా వచ్చినావంటే—దాని అర్థమేంది? అంటరానితనం తగ్గిపోయిందంటావా? లేదా? మన తాత ముత్తాతలంతా యిలాగే కులభేదం లేకుండా వుండారంటావా?

కోటిగాడు: ఆ—ఎంతైనా. కుడియెడమా వుండొద్దా చుక్కయ్యా—

చుక్కయ్య: కుడీలేదు. యెడమాలేదు. నోర్ముయ్. నీలాంటివాళ్లుండబట్టే యీ దేశం యిలావుంది ఇప్పుడిప్పుడే మనదేశం మొగ్గ తొడుగుతుందిరా గాడిద—

కోటిగాడు: సరేలే—అదంతా నాకెందుగ్గాని—ఇవ్వాళ పొయ్యిలో పిల్లి లేవలేదు చుక్కయ్యా—

చుక్కయ్య: చూసినావా? ఎంతోకష్టపడుతున్నావు గాని యేరోజు కారోజే నీకు గతిలేకుండా పోతుంది.

కోటిగాడు: చేతినిండా పనిదొరకడంలేదు చుక్కయ్యా.

చుక్కయ్య: తొందరపడకు—మంచి రోజులు రానివ్వు— (మూల బుట్టలోవున్న ఒక పూలదండ తీసి) ఒరేయ్. కోటయ్యా. యీ పూలదండ యెలావుంది?

కోటిగాడు: చాలాబాగుంది ఎక్కడిది చుక్కయ్యా—

చుక్కయ్య: ఎంతోకష్టపడి తయారు చేశాను.

కోటిగాడు: నువ్వు చేసినపనికి మరొకడు, వంకపెట్టడమా?

(బైట కారు ఆగినచప్పుడు—పరంధామయ్య, గోపాలం ప్రవేశం—కూలివాడు పెట్టె బెడ్డింగు తీసుకొని వస్తాడు)

చుక్కయ్య: దండాలు బాబయ్యా—

కోటిగాడు: దండాలు బాబూ—

చుక్కయ్య: (పూలదండ గోపాలం మెడలో వేస్తుంటాడు.)

గోపాలం: చూడండి నాన్నా. చుక్కయ్యకు నేనంటే యెంత గౌరవమో—

(మెడలోనుంచి దండతీసి బల్లమీద వుంచుతాడు)

పరంధామయ్య: ఎప్పుడూ నిన్ను కలవరిస్తూ వుండే వాడు. చుక్కయ్యలాంటి వాళ్లుండబట్టే మన సంసారాల గౌరవాలు నిలబడుతున్నాయి—మనం పట్టించుకున్నా, పట్టించుకోకపోయినా.

చుక్కయ్య: నాదేముందిబాబూ — పేపోణ్ణి బాబుగారు పాదం పెట్టారోలేదో చూడండి. ఈ యిల్లంతా యెలా కళకళలాడి పోతుందో.

కోటిగాడు: మీరు వస్తున్నారనేసరికి—రేయింబవళ్లు నిద్రపోకుండా యీ యింటిని చుక్కయ్య అందంగా అలంకరించేశాడు బాబూ—

గోపాలం: జర్మనీ దేశంలో ఇళ్లను యెలా అలంకరించుకోవాలో చెప్పేందుకు ప్రత్యేకంగా ఉద్యోగులు వుంటారు. వాళ్లు గృహ నిర్మాణంలో ప్రత్యేక విద్య నభ్యసిస్తారు. నిజంగా మన చుక్కయ్యలాంటి వాళ్లు—వాళ్లతో యే మాత్రం తీసి పోలేదు.

(అంతా నవ్వుతారు)

చుక్కయ్య: పోండి బాబూ—

గోపాలం: నిజమే చుక్కయ్యా—అనుభవాల ముందు చదువులు దమ్మిడీకి పనికిరావు తెలుసా?

చుక్కయ్య: సరేగాని బాబూ, జర్మనీ దేశం పోయారు గందా—హిట్లరు యింకా బతికే వుండాడా? లేక నిజంగానే చచ్చి పోయాడంటారా?

గోపాలం: చూశారానాన్నా, చుక్కయ్యతెలివి!

చుక్కయ్య: అవును బాబూ, రెండో ప్రపంచయుద్ధంలో హిట్లరు పేరు చెబితే పిట్టలు నీళ్లు తాగేవికాదు. అప్పుడుమీరు చిన్న దొరలు నా వీపుమీద మిమ్మల్ని యెక్కించుకుని వూరంతా తిప్పేవాణ్ణి!

గోపాలం: ఆమాట అంటుంటే నేను మళ్లీ చిన్నపిల్లవాణ్నై నీవీపు మీద యెక్కి తిరగాలనిపిస్తుంది చుక్కయ్యా

చుక్కయ్య: దానికేందిబాబూ, కావాలంటే యిప్పుడైనా వీపుమీద యెక్కండి. వూరంతా తిప్పుకొస్తాను.

(అంతా నవ్వుతారు)

మీలాంటి మంచి దొరల్ని వీపుమీద యెక్కించుకోవడం పుణ్యం చేసుకున్నట్టే బాబూ—

పరంధామయ్య: ఏరా, కోటిగా—నీవు తరవాత కనిపించు—చుక్కయ్యా, నీవు బాబుగారికి వేన్నీళ్లు పెట్టించు.

చుక్కయ్య: అలాగేదొరా—

(చుక్కయ్య, కోటిగాడువెళ్తారు)

పరంధామయ్య: ఏం, నాయనా, జర్మనీదేశం చల్లగావుందా—

గోపాలం: విదేశాల స్థాయిని మనదేశం అందుకోవాలంటే ప్రతి వ్యక్తిలోనూ బోలెడంత మార్పురావాలి నాన్నా—ప్రజలంతా, తాము సమానులమనే భావంతో పనిచేస్తే, భారతదేశ ఔన్నత్యం—కొద్ది రోజుల్లోనే పరాకాష్ఠ నందుకుంటుంది నాన్నా—

పరంధామయ్య: జర్మనీదేశంలో నీ శిక్షణ, విజయవంతంగా ముగించి నట్టేనా బాబూ!

గోపాలం: నా పరిమితి కాలంలో శిక్షణ విజయవంతంగానే ముగిసింది. కాని వ్యవసాయ రంగంలో వారు సాధించిన అభివృద్ధిని ముఖ్యంగా సహకార వ్యవసాయాన్ని అర్థం చేసుకోవాలంటే, యింకా రెండు సంవత్సరాలు పడుతుంది నాన్నా—

పరంధామయ్య: ఈనాడు మీఅమ్మ వుంటే నిన్నుచూసి యెంతో సంతోషించేదో—

గోపాలం: నిజమే నాన్న—అమ్మను చూసే భాగ్యం నాకు లేక పోయింది. బెర్లిన్ నగరంలో ఒకసారి నేను వెళ్తుండగా బజారులో ఓ స్త్రీ కనిపించిందిండి. ఆమె దుస్తులు వేరుగా వున్నా—ఆ ముక్కూ—ముఖం అంతా అమ్మలాగే వున్నాయి. నాకు ఆమె 'అమ్మా' అని పిలవాలనిపించింది.

పరంధామయ్య: ఎవ్వరు యే దేశంలో పుడితే మాత్రం యేం పోయింది. అందరం మానవులమే— అందరిలోనూ ఒకే రక్తం ప్రవహిస్తుంది.

గోపాలం: మానవత్వానికి విదేశాల్లో విలువ యెక్కువగా వుంది నాన్నా—వృత్తి గౌరవం విధిగా పాటింపబడుతుంది.

చుక్కయ్య: (లోపలనుండి) వేన్నీళ్లు సిద్ధంగా ఉన్నాయి బాబూ—

పరంధామయ్య: స్నానానికి వెళ్లిరా నాయనా—

(గోపాలం వెళ్తాడు)

ధర్మయ్య: (ప్రవేశం) దండాలు బాబూ—

పరంధామయ్య: ఏమి ధర్మయ్యా—ఏమిటి సంగతులూ

ధర్మయ్య: ఏముందిబాబూ గోపాలంబాబూ వచ్చారని తెలిసి చూచి పోదామని వచ్చాను.

పరంధామయ్య: అలాగా—అబ్బాయి విశ్రాంతి తీసుకోబోతున్నాడే— తరువాత యెప్పుడైనా నిదానంగా చూద్దువు గానిలే—

ధర్మయ్య: రైతులు, కూలీలు అంతా కలిసి సాయంత్రం సభ జరపాలని నిర్ణయించాం. బాబుగారు ఆ సభలో ఉపన్యాసం యివ్వాలని ఆహ్వానించడానికి వచ్చాను బాబూ—

పరంధామయ్య: చూడు ధర్మయ్యా—వాడు యేదో విదేశాలు వెళ్లి చదువుకొనివచ్చాడు. ఇక్కడేదో ఆకతాయిగ్గావుండేటప్పుడు రైతు సంఘం అనీ, అదీ యిదీ అని తిరుగుతుండేవాడు. ఇప్పుడేదో ప్రశాంతంగా బ్రతుకుతున్నాడు మళ్లీవాణ్ణి సభ లనీ సమావేశాలనీ తీసుకెళ్లి యిరుకులో పెట్టేలావున్నారు. అవేమీ కుదురవు.

ధర్మయ్య: అదేంబాబు—బాబుగారి వంటి దేశ సేవకుల పుణ్యమా అంటూ, మనకు నందికొండ ప్రాజెక్టు వస్తుంది. మనం తరతరాలుగా కన్నకలలు పండేరోజులు దగ్గర పడు తున్నాయి. ఈ శుభ సమయంలో గోపాలం బాబును మా పేద ప్రజానీకం సన్మానించాలను కుంటున్నారు.

పరంధామయ్య: ఔను సన్మానించి అల్లుణ్ణి చేసుకోవా లనుకుంటు న్నావు. ఔనా?

ధర్మయ్య: (విచారంగా) బాబూ—ఏమిటి మీరంటున్నది.

పరంధామయ్య: ఏమీలేదు మీకూతురు రాధను కాస్త అదుపులో పెట్టుకోండి అంటున్నాను. సరేనా?

ధర్మయ్య: బాబూ—అనరాని మాటలు అంటున్నారు. కూటికీ గుడ్డకూ పేదవాళ్లమైనా, కులానికీ గౌరవానికీ పేదవాళ్లం కాము బాబూ—

పరంధామయ్య: ఔను—కాదు గాబట్టే మావాణ్ణి అల్లుణ్ణి చేసుకుందా మనుకుంటున్నావు

ధర్మయ్య: ఆకోరిక నాకేనాటికి లేదుబాబూ—ఆయనకు మాలాంటి పేదవాళ్లంటే జాలి, అందుచేత మా కేదైనా సహాయం చెయ్యాలని మా పల్లెలవెంట తిరుగుతూ అందరినీ ఐక మత్యంగా నడుపుతూ వుండేవారు. అందువల్లనే ఆయనంటే నాకు యిష్టం.

పరంధామయ్య: ఏవియేమైనా, నీకు పుణ్యముంటుంది. ఏదో నేటి కాలానికి నాకొడుకు చేతికందాడు. మళ్లీ వాణ్ణి మీ చుట్టూ తిప్పుకున్నారంటే నా జీవితమే నాశనమౌతుంది.

ధర్మయ్య: క్షమించాలి తమరికొడుకును చెడగొట్టి మేము బాగు పడేదేమీలేదు. నేను బిడ్డలు గలవాణ్ణి. గోపాలంబాబంటే అందరికీ గౌరవం యేర్పడింది. అందువల్లనే మేంకూడా ఆయన కోసం వస్తుంటాం.

పరంధామయ్య: సరే. ఇకమాత్రం అలాంటివి జరగడానికి వీల్లేదు.

గోపాలం: (ప్రవేశం) నమస్కారం ధర్మయ్యగారూ—

ధర్మయ్య: నమస్కారం బాబూ—దూరదేశాలకు వెళ్లి క్షేమంగా చేరారు చాలా సంతోషం బాబూ.

గోపాలం: మనవాళ్లంతా క్షేమమేకదా? నెమ్మదిగా అందర్నీ కలుస్తాను. అలా నిలబడ్డారేం కూర్చోండి ధర్మయ్యగారూ—

ధర్మయ్య: (సంశయిస్తూ పరంధామయ్య వంకచూస్తుంటాడు)

పరంధామయ్య: కూర్చోండి ధర్మయ్యగారూ—

(ధర్మయ్య కూర్చుంటాడు)

గోపాలం: మనవాళ్లందర్నీ వ్యక్తిగతంగా కలుసుకోవడం చాలా కష్టం—అందుచేత సాధ్యమయినంత త్వరలో ఒక సభ యేర్పాటుచేస్తే నేను అందరితోను మాట్లాడ్డానికి బాగుంటుంది.

ధర్మయ్య: తమరికోసం యీ సాయంకాలం సభ యేర్పాటు చేశాం. ఆవిషయం మీకు తెలియ చేయడానికి వచ్చాను.

గోపాలం: చాలాసంతోషం. సభ యేర్పాటు చేస్తున్నందుకు చాలా వందనాలు.

ధర్మయ్య: వస్తాబాబు—వందనాలు.

పరంధామయ్య: వెళ్లిరండి ధర్మయ్యగారూ—

(ధర్మయ్య వెళ్లిపోతాడు)

పరంధామయ్య: ఆ కూలీలసభకు నీవు తప్పకుండా వెళ్లాలానాన్నా—

గోపాలం: రైతు కూలీల సభకదా నాన్నా—వెళ్లడం చాలా అవసరం.

పరంధామయ్య: మన అంతస్తుకు తగిన సభలు కాదేమో—

గోపాలం. ప్రజాస్వామ్యం దేశంలో మనిషికీ మనిషికీ మధ్య అంతస్తుల్లేవు నాన్నా—

పరంధామయ్య. అయితే వాళ్లకీ మనకీ భేదాలు లేవంటావు.

గోపాలం: ఉన్నాయని అనుకున్నందువల్ల వచ్చే ప్రయోజనం కూడా లేదు

పరంధామయ్య: విదేశాల చదువువల్ల పెద్ద మార్పేమీ రాలేదన్న మాట!

గోపాలం: ఎందుకురాలేదు. మార్పు వచ్చింది కాబట్టే యిలా మాట్లాడ్డం—

పరంధామయ్య: గోపాలం, నేనుచెప్పే మాటలు కాస్త సానుభూతితో ఆలోచించు—నీవు సుఖంగా బ్రతుకుతుంటే. చూసి ఆనందించాలనేదే నా కోరిక—అంతకంటే నేను కోరుకునేదేమీలేదు.

గోపాలం: నా సుఖాన్ని మీరు కోరుతున్నట్లైతే నేను చెప్పినట్లు చెయ్యండి.

పరంధామయ్య: నాకు సమ్మతంగా ఉంటే అలాగే చేస్తాను. ముందునీవు విశ్రాంతి తీసుకో—

(ఇద్దరూలేచి వెళ్తుండగా తెర)

(మిగతా వచ్చే సంచికలో)

---

తొట్రు పడనేల, చెల్వ! ముందునకు పోవు

వారి వెనుకకు లాగు ప్రపంచ మనుచు!

ఇగురు కారాకు ద్రోచి రేకెత్తె నదిగో!

వాడి పోవకముందే దేవతవు రమ్ము.

"మధుగీత"



# ప్రగతి పథంలో

(జిల్లాలనుంచి అందిన వివిధ అభివృద్ధి కార్యక్రమాలను గురించిన సంక్షిప్త వార్తలు)

## ఆదిలాబాదు

### గిరిజన దినోత్సవం

ఆదిలాబాదులో మార్చి 31 వ తేదీన "గిరిజన దినోత్సవం" జరిగింది. ఈ సందర్భంలో ఏర్పాటయిన ఆటల పోటీలలో గెలుపొందినవారికి బహుమతులివ్వడం జరిగింది. ఈ సందర్భంలోనే శిశుప్రదర్శనం కూడా జరిగింది.

## అనంతపురం

### వయోజన విద్యా కేంద్రం

1962 ఫిబ్రవరి నెలలో సింగనమాల పంచాయతీ సమితిలోని కొంటాపురంలో వయోజన విద్యా కేంద్ర ఒకటి తెరువబడింది.

## కడప

### రెండు రోజుల మేలా

పెండ్లిమర్రి పంచాయతీసమితిలోని చింతకొమ్మ దిన్నె గ్రామంలో మార్చి 7,8 తేదీలలో మేలా-ప్రదర్శనం జరిగింది.

## గుంటూరు

### బుదంపాడుకు నీటి సరఫరా

మార్చి 16 వ తేదీన ప్రణాళికా మంత్రి రూ 28,000/-లు ఖర్చు కాగల బుదంపాడు నీటి సరఫరా పథకానికి శంకుస్థాపన చేశారు.

### ఎ.సి.సి. ఆఫీసర్ల శిక్షణ శిబిరం

1962 మార్చి నెలాఖరువారంలో గుంటూరులో ఏ.సి.సి. ఆఫీసర్ల శిక్షణ శిబిరం ఒకటి ఏర్పాటయింది. ఈ ఆఫీసర్లలో 105 మంది పురుషులు, నల్గురు మహిళలు శిక్షణ పొందారు.

### టెలిఫోన్ ఎక్స్చేంజి

ఒంగోలు తాలూకాలోని తిమ్మ సముద్రంలో 1962 ఏప్రిల్ నెలలో ఒక టెలిఫోన్ ఎక్స్చేంజి, ఒక పబ్లిక్ కాల్ ఆఫీసు తెరువబడినాయి.

### పశు ప్రదర్శన

మార్చినెలలో గుంటూరులో మూడురోజులపాటు రాష్ట్రీ పశుప్రదర్శనం జరిగింది. అన్ని జాతులకు చెందిన 800 పశువులు ఇందులో పాల్గొన్నాయి. ఈ సందర్భంలో గెలుపొందిన పశువులకు రు 10,000/- లు విలువగల బహుమతులు ఇచ్చారు.



వికారాబాదులోని అనంతగిరి క్షయచికిత్సా కేంద్రంవారు 27_3_62 న ఏర్పాటు చేసిన వార్షికోత్సవ సందర్భంలో ఆంధ్రప్రదేశ్ గవర్నరు ఇచ్చిన ఉపన్యాసాన్ని వింటున్న క్షయరోగులు.



**వికారాబాదులో అనంతగిరివద్ద నున్న అనంతస్వామి దేవాలయం.**



1962 ఏప్రిల్ 7 వ తేదీన ప్రపంచ ఆరోగ్య దినోత్సవం సందర్భంగా హైద్రాబాదులో జరిగిన అలంకృత శకటాల ఊరేగింపు.



ఆఫ్ఘన్ సుహృద్భావ సంఘం హైద్రాబాదుకు 30_3_1962న వచ్చింది



**ఆఫ్ఘన్ గాన కళాకారుల బృందంచే హైద్రాబాదులోని గాంధీభవనంలో 26_3_1962 న గానసభ జరుపబడినప్పటి దృశ్యం**



మధ్యప్రదేశ్ నుంచి వచ్చిన సాంస్కృతిక బృందంవారు హైదరాబాదులో 1962 మార్చి 20 వ తేదీన "ధూమకేతు"
ఆనే ఒక నాటకాన్ని ప్రదర్శించారు. అందులోని ఒక దృశ్యం.



పరిపాలన విధానం ప్రత్యేక నిపుణులకే వదల వలెనా?" అనే అంశంపై ఆక్స్‌ఫర్డ్ బ్రేసినోస్ కాలేజి ప్రిన్సిపాల్ సర్ ఫ్రెడెరిక్ హాల్
31-3-62న హైదరాబాదు సెక్రటేరియట్‌లోని కమిటీ రూములో ప్రసంగిస్తున్న దృశ్యం. ఈయన కొంతకాలం
ఇంగ్లాండులోని థేమ్స్ వద్ద హెన్లీ. అడ్మినిస్ట్రేటివ్ స్టాఫ్ కాలేజీ ప్రిన్సిపాలుగా పని చేశారు



వామ హస్తంలో పాత్రకల బుద్ధ భగవానుని కాంస్య విగ్రహం.



చిరునవ్వు చిలకరిస్తున్న బుద్ధ భగవానుని మరొక విగ్రహం.



రెండు పిడులు వుండి, నృత్య భంగిమలు చెక్కబడిన పాత్ర



విక్టోరియా ఫర్నీచరు– ఒకసోఫా, రెండు కుర్చీలు.



నూర్జహాన్, జహంగీరు, ఔరంగజేబులకు చెందిన పిడి బాకులు. షాహజహాన్ 'కట్లార్'



16వ లూయీ భార్య మేరీ ఆంటోనెట్ ఉపయోగించిన డ్రెస్సింగ్ టేబిల్.



నల్గొండ జిల్లాలోని పిల్లలమర్రిలో శివాలయపు గోడమీద వున్న గజరాజు శిల్పం.



రాష్ట్ర విద్యాశాఖామాత్యులు శ్రీ పి. వి. జి. రాజు సికింద్రాబాదులో 29_3_1962 న,యన్. సి. సి. 8వ దళానికి చెందిన స్టేషన్ కమాండర్ల సమావేశానికి ప్రారంభోత్సవం చేశారు.

#### పశు వైద్యశాల

మార్చి 27 వ తేదీన మోదుకూరులో పశువైద్యశాల భవనాలకు ప్రారంభోత్సవం జరిగింది. రు. 50,000/- ల ఖర్చుతో ఈ గ్రామ ప్రజలు ఈ భవనాలను నిర్మించారు.

#### మహిళా శిక్షణ శిబిరం

నాదెండ్ల పంచాయతీ సమితి ఆధ్వర్యాన తిమ్మాపురంలో మహిళా శిక్షణ శిబిరం మూడు రోజుల పాటు నిర్వహింపబడింది. ఈ శిబిరంలో 40 మంది మహిళలు శిక్షణ పొందారు.

#### ప్రాంతీయ పోటీలు

1962 ఏప్రిల్ మొదటివారంలో గుంటూరులో జరిగిన ప్రాంతీయ సంగీత నాటక పోటీలలో గుంటూరు జిల్లాకు ప్రథమ బహుమతి లభించింది. గురజాల జిల్లా పరిషత్తు హైస్కూలు విద్యార్థులు ప్రథమ బహుమతి సంపాదించారు.

### హైద్రాబాదు

#### కుటుంబ నియంత్రణ గోష్ఠి

ఇబ్రహీంపటం పంచాయతీసమితికి చెందిన ఆరుట్ల గ్రామంలో మార్చి 23 నుంచి మార్చి 25 వరకు కుటుంబ నియంత్రణ గోష్ఠి జరిగింది. పరిసర గ్రామాల నుంచి వచ్చిన 67 మంది స్త్రీలు ఈ గోష్ఠిలో పాల్గొన్నారు.

#### వ్యవసాయ పనుల అభివృద్ధి

హైద్రాబాదు జిల్లాలో ఫిబ్రవరి నెలలో వ్యవసాయ పనుల అభివృద్ధి నెమ్మదిగా జరిగింది. స్థానికంగా లభ్యమయ్యే పదార్థాలతో క్రొత్త పద్ధతులలో కంపోస్టు యెరువుల తయారుకు తగిన వసతుల అభివృద్ధికై ఒక పథకం అమలు జరిగింది.

#### గ్రామలక్ష్మి కేంద్రం

దేవాదాయ ధర్మాదాయ శాఖల మంత్రిణి శ్రీమతి టి యన్. సదాలక్ష్మి మార్చి 16 వ తేదీన పెద్దమంగళారంలో చేవెళ్ళ పంచాయతీసమితి ఏర్పాటు చేసిన గ్రామలక్ష్మి శిక్షణ కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు.

### కరీంనగరం

#### కొత్తపల్లిలో కుటుంబనియంత్రణ శిబిరం

కుటుంబ నియంత్రణ విషయాలు తెలియజేయుటకు మార్చి 25 వ తేదీన కొత్తపల్లిలో ఒకశిబిరం నిర్వహించబడింది. ఈ సందర్భంలో కుటుంబనియంత్రణ ప్రదర్శన కూడా ఒకటి ఏర్పాటయింది.

#### జిల్లా సమాచార కేంద్రం

న్యాయ, సమాచార శాఖల మంత్రి శ్రీ పి. వి. నరసింహారావు కరీంనగరంలో ఏప్రిల్ 14 వ తేదీన జిల్లా సమాచార కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు.

### ఖమ్మం

#### కుటుంబ నియంత్రణ శిబిరం

1962 మార్చి నెలలో వైరాలో మూడు రోజుల పాటు కుటుంబ నియంత్రణ శిబిరం ఏర్పాటు చేయబడింది. విలేజిలెవల్ వర్కర్సు, విస్తరణ శాఖాధికారులు గ్రామ సేవికలు, ఉపాధ్యాయులు మొత్తం 50 మంది ప్రతినిధులు ఇందులో పాల్గొన్నారు.

### కృష్ణా

#### గన్నవరంలో యువజన శిబిరం

మార్చి నెలలో గన్నవరంలో మూడు రోజులపాటు ఒక యువజన శిబిరాన్ని ఏర్పాటు చేశారు. ఈ సందర్భంలో ఆటల పోటీలు జరిగినాయి.

#### ఎంప్లాయ్‌మెంటు సర్వీసు బ్యూరో

నేషనల్ ఎంప్లాయ్‌మెంటు సర్వీసు పథకం క్రింద గన్నవరంలో మార్చి 23వ తేదీన పంచాయతీ సమితిలో ఉద్యోగ సమాచార, సహాయ విభాగం ఒకటి తెరువబడింది.

#### గూడూరు సమితి మేలా

1962 మార్చి నెలాఖరువారంలో పెడన జిల్లాపరిషత్తు హైస్కూలు ఆవరణలో గూడూరు పంచాయతీసమితి ఆధ్వర్యాన మూడురోజుల మేలా జరిగింది. ఈ సందర్భంలో గ్రామీణ చేతి పనుల ప్రదర్శన, పంట పోటీలు, దేహ సౌష్ఠవ పోటీలు సాంస్కృతిక పోటీలు జరిగినవి.

### కర్నూలు

#### మహిళామండలులు

నంద్యాల బ్లాకులోని కొత్తపల్లి, నందిపల్లి గ్రామాలలో 1962 ఫిబ్రవరి నెలలో రెండు మహిళా మండలులు ఆరంభమైనాయి.

## మహబూబునగరం

### గ్రామానికి విద్యుచ్ఛక్తి సరఫరా

వనపర్తికి రెండుమైళ్ళ దూరంలో నున్న నాగారం గ్రామానికి భవనాలు, హైవేస్ మంత్రి ఏప్రిల్ 2 వ తేదీన విద్యుచ్ఛక్తి మీటను నొక్కినారు.

### మరొక గ్రామానికి విద్యుచ్ఛక్తి సరఫరా

మహబూబునగరం జిల్లా కలెక్టరు మార్చి 31 వ తేదీన ఆలూరులో విద్యుచ్ఛక్తి మీట నొక్కినారు.

### నిర్బంధ విద్యా పథకం

నిర్బంధ విద్యా పథకాన్ని విజయవంతంగా అమలుపరచడానికై పంచవర్షప్రణాళిక క్రింద మహబూబునగరం జిల్లాకు ప్రభుత్వం ఈ సంవత్సరం 170 మంది ఉపాధ్యాయ పదవులను మంజూరు చేసింది. పంచవర్షప్రణాళికా కాలంలో మొత్తం 1670 మంది ఉపాధ్యాయుల నియామకం జరగవలసి వుంటుంది

### లోక సహాయక సేన శిక్షణ శిబిరం

1962 ఏప్రిల్ మొదటివారంలో దేవరకొండలో లోక సహాయక శిక్షణ శిబిరం నిర్వహించబడింది.

### నూతన పాఠశాల భవనం

భవనాలు హైవేస్ మంత్రి వనపర్తిలో ఏప్రిల్ 3 వ తేదీన ఆరు గదులు గల పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం చేశారు.

## మెదక్

### భిక్షువులకు ఆశ్రయం

1962 మార్చి నెలలో సదాశివపేటలో భిక్షువులకూ, వికలాంగులకూ జిల్లా ఆశ్రయ గృహం ఒకటి ఆరభింపబడింది

## నల్గొండ

### పంచాయతీరాజ్ గోష్ఠి

1962 ఏప్రిల్ నెలలో మిర్యాలగూడెంలో పంచాయతీరాజ్ డివిజన్ స్థాయిన ఒక గోష్ఠి జరిగింది. వివిధ పంచాయతీసమితులనుంచి వచ్చిన ప్రతినిధులు ఇందులో పాల్గొని పంచాయతి రాజ్‌కు సంబంధించిన సమస్యలు చర్చించారు.

### వ్యవసాయ పనులలో 44 మంది సహాయకులకు శిక్షణ

మార్చినెలాఖరువారంలో ఆలేరు పంచాయతి సమితిలోని వివిధ సంస్థలనుంచివచ్చిన 44 మంది సహాయకులకు ధనరెడ్డిగూడ గ్రామంలో మూడు రోజులపాటు అభివృద్ధికర వ్యవసాయ పద్ధతులు, సహకారం, పంచాయతీరాజ్ మున్నగు విషయములలో శిక్షణ ఇవ్వడం జరిగింది.

### ఉత్తమ గ్రామసేవకుడు

నల్గొండ జిల్లాలో గ్రామసేవకులకొరకు జిల్లాస్థాయిలో ఏర్పాటు అయిన న్యాయమూర్తుల సంఘం శ్రీ సయ్యద్ యాశంను ఉత్తమ గ్రామసేవకునిగా నిర్ణయించింది. శ్రీ సయ్యద్ యాశం ఆలేరు పంచాయతి సమితికి చెందినవారు. వీరికి రు. 200/- నగదు బహుమతి లభిస్తుంది.

### ఉత్తమ గ్రామం

చౌటుప్పల పంచాయతి సమితిలోని ఒక కుగ్రామమైన తంగెడపల్లి 1961-62 సంవత్సరానికి ఉత్తమ గ్రామంగా ప్రకటించ బడింది. ఈ గ్రామం నల్గొండకు పశ్చిమంగా 35 మైళ్ళ దూరంలో వుంది. గ్రామ జనాభా 3192. ఇది అభివృద్ధిలో మంచి రికార్డు చూపింది. ఇక్కడ వున్న సహకార సంఘం, పంచాయతీ, పాఠశాల సమర్థవంతంగా పనిచేస్తున్నాయి. స్త్రీ సంక్షేమంకొరకై ఒక మహిళామండలి ఏర్పాటయింది. ఈ గ్రామంలో యువజన క్లబ్, ఒక గ్రంథాలయం, ఒక కమ్యూనిటి రేడియో సెట్టు వున్నాయి. గ్రామంలో రోడ్లను గ్రామస్తులే స్వయంగా నిర్మించారు.

## నెల్లూరు

### సహకార సంఘంలో క్రొత్త సభ్యుల చేరిక

1962 ఫిబ్రవరి నెలలో చేజెర్ల బ్లాకులో అనంతసాగరంలో వున్న పరపతి, బహుళార్థసాధక సహకార సంఘంలో క్రొత్తగా 30 మంది సభ్యులుగా చేరారు.

## నిజామాబాదు

### పశు ప్రదర్శనం

పంచాయతీ సమితి అధ్వర్యాన మద్నూరులో మార్చి 25 వ తేదీన పశు ప్రదర్శనం జరిగింది.

## శ్రీకాకుళం

### చక్కెర ఫ్యాక్టరీలో ఉత్పత్తి ఆరంభం

రాష్ట్ర ప్రభుత్వం ప్రోత్సహించిన నాలుగు సహకార చక్కెర ఫ్యాక్టరీలలో ఆముదాలవలస చక్కెర ఫ్యాక్టరీ మిగతా

వాటికంటే ముందుగానే ఏప్రిల్ 1వ తేదీన ఉత్పత్తి ఆరంభించింది. ఈ ఫ్యాక్టరీ ఉత్పత్తి శక్తి రోజుకు 1500 టన్నులు.

జిల్లా సమాచార కేంద్రం

జిల్లా కలెక్టరు మార్చి 31 తేదీన జిల్లా సమాచార కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు.

## విశాఖపట్నం

గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం

యలమంచిలి పంచాయతీ సమితిలోని కొట్టూరు గ్రామంలో మార్చి 29 నుంచి మార్చి 31 వరకు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం ఒకటి నిర్వహించబడింది

మహిళా సంఘం ఉత్సవాలు

విశాఖపట్నం మహిళాసంఘం పంచమ వార్షికోత్సవం మార్చి 25వ తేదీన జరిగింది. ఈ సంఘం వయోజన స్త్రీల పాఠశాల నొకదానిని నిర్వహిస్తున్నది. ఈ పాఠశాలలో చదువుతున్న వయస్సు మళ్ళిన స్త్రీలకు ఉచిత భోజనం, స్టైపెండు చిల్లర ఖర్చులకు డబ్బు లివ్వడం వగైరా సౌకర్యాలు కల్పించబడినాయి.

వడ్డాదిలో పబ్లిక్ కాల్ ఆఫీసు

వడ్డాది పోస్టాఫీసులో 1962 ఏప్రిల్ నెలలో పబ్లిక్ కాల్ ఆఫీసు తెరువబడింది

## వరంగల్

ప్రాంతీయ సంగీత నాటక గోష్ఠి

1962 మార్చిలో వరంగల్‌లో సంగీత నాటక గోష్ఠి ఒకటి జరిగింది. ఖమ్మం నాటక బృందంవారు ప్రదర్శించిన "ప్రతిఫలం" అనే నాటకాన్ని ఉత్తమమైనదిగా న్యాయమూర్తులు నిర్ణయించారు.

## పశ్చిమ గోదావరి

తణుకులో అగ్నిమాపక దళం

మార్చి 31 తేదీన పంచాయతీ సమితి ఆవరణలో అగ్నిమాపక దళం ఒకటి తెరువబడింది.

పూర్వ విస్తరణ కేంద్ర ప్రారంభోత్సవం

పశ్చిమ గోదావరి జిల్లా కలెక్టరు 1962 మార్చి 28 వ తేదీన పెనుగొండ పూర్వ-విస్తరణ బ్లాకుకు ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంలో ఏలూరు సాంద్ర వ్యవసాయ పథకానికి చెందిన క్షేత్ర నిర్వహణ ప్రత్యేక నిపుణుడు సాంద్ర వ్యవసాయ పథకంవల్లనూ, తీవ్రోత్పత్తివల్లనూ వ్యవసాయదారులకు కలిగే లాభాలనుగూర్చి తెలిపారు. ఇంకా మరికొందరు మాట్లాడిన తరువాత నిమ్నజాతులు, వెనుకబడ్డ తరగతులకు చెందిన విద్యార్థులకు బహుమతు లివ్వడం జరిగింది. ఈ బ్లాకు ప్రాంతంలో సమర్థులైన చేతివృత్తుల పని వారికి తగిన పరికరాలను బహుమతులుగా ఇచ్చారు.

సహకార మార్కెటింగు సంఘం

1962 మార్చి నెలలో పేరుపాలెంలో మత్స్య సహకార మార్కెటింగు సంఘానికి ప్రారంభోత్సవం జరిగింది.

సంగీత నాటక గోష్ఠి

సమాచార పౌర సంబంధములశాఖ అధ్వర్యాన ఏలూరులో మార్చి 21 వ తేదీన జిల్లా చతుర్థ సంగీత నాటక గోష్ఠి జరిగింది.

---

చివుకు మోడుల జివురింప జేయుశక్తి
లేదు దేవి! యీ మధుర మధూదయాన,
వాడుట యెరుంగనట్టి జీవనముతోడ
అమృత మొనరింపు మీ వసంతమును నీవ?

"మధుగీత"

# సౌశీల్యము

శ్రీ సి.వి. సుబ్బన్న "శతావధాని"

(ఉత్తర దిగ్యాత్ర చేయు అష్టావక్ర మునికుమారుని చిత్తశుద్ధి పరీక్షించుటకు
వదాన్య మహాముని కల్పించిన ప్రకృతిశోభ)

ఆ లవిన్ బ్రహ్మచర్య వ్రతోదారుఁడు
జ్వలన్మతిన్ బోయి కనెన్ సమంతతః
జలోర్మిచ్ఛటాఘృష్టి సంఫుల్లరాజీ
వాశీస్వనత్ షట్పది, బాహుదానదిఁ.

స్ఫురదమరపుర పరివృఢ తురగ పుచ్ఛసచ్ఛవి రమ్యముల్
జరఠ విషధర వర విగళిత వళక్షకంచుక తుల్యముల్
శరదమృతకిరణ శిశిరమధుర చంద్రికాద్యుతి సౌమ్యముల్
తరగ గములు విశద విశద రుచి తన్మయీకృత లోకముల్.

శఫరీ వివృత్తలోచన చాక చక్యమ్ము
లలసోర్మికా హాళాహాళికలచర.
మురళీస్వనానుగాంబు వివర్తనర్తన
మ్ము లవిరళ తరంగముల్ చెలంగ,
సామిఫుల్ల సరోజ సౌరభ్య భరితముల్
చిత్ర హేవాక వీచకలు దనర,
చక్రోపసృతి పరస్పర శూన్యమధ్యముల్
ముహురుల్ల లద్భంగముల్ మలంగ.
అమ్మయమ్ము స్రోతఃప్రవాహమ్ము శ్రీమ
యమ్ముగాఁ దోఁచె సకలమ్ము క్రమ్ముతా వి
తట వనైలాలతాలాస్య ఝుటితి కీర్ణ
పవన గతి మించె ఘ్రాణ నిర్వాణ వృత్తి.

సుకుమారమ్ములు బాహుదాక్ష్యవిలసత్స్రో తస్వినీగంధవా
హకిశోరమ్ములు మాంద్యకృత్సురభి లీలానర్మ సామగ్రి బో
రుకొనన్ మాటికి పైపయిన్ మలయు తీరుల్ మారకేళీసుఖో
త్సుక జీవాతువు లస్ఫుటార్థములు చేతోధైర్యకుద్దాలముల్.

తాదృగ్భావనలేనివానిగొని. తత్రత్యత్యంత శోభోచ్చయ
ప్రాదుర్భావముచేత వాని మతి మార్గంబెల్ల శాసించుచున్
తాదృగ్భావన గల్గువాని జలుపన్ సాగించు యత్నంబు చే
తోదౌర్బల్యము మీఱె నేనచట బొందుం బూర్ణ సాఫల్యమున్.

నదినదివోలెఁగాదు నవనాట్య విలాసిని వోలెఁగానిపిం
చె, దవులవచ్చు మానిసులఁజెంతకు లాగెడి ముగ్ధముగ్ధ హే
ల దనర, సాధుసాధు రవలాలిత వైఖరి చెంగలింప, శ
శ్వదమృత ఫేన హాసలవచాతురిపైకొన హృద్యహృద్యమై.

నద్యంభ స్తనుభంగవేపద్ధుగతిః సంగీత మేలాగునన్
హృద్యహ్లాద మనోహరంబెసఁగునో ప్రేమన్విలోకించి, ప్రో
ష్ఠీద్యుత్యచ్ఛరుచిచ్ఛటాచ్ఛలమునన్ జెల్వారు నాగాంగనల్
సద్యఃకోమల గీత మాలికల నాలాపింప రాకుండినన్.

ఆ దూరమ్మున అప్సరోఽంగనలు ఒయ్యారమ్ముతోరమ్ముగా
నేదోహేల నటించుచున్ తెలిమొగిళ్లెట్లుల్లు కుచ్చెళ్లు పె
ల్లాదీప్తుల్ విరియింప, విస్ఫుటఫణా వ్యాపార నాగేంద్ర మ
ర్యాదన్ సారెకు హస్త సంజ్ఞఁబిలుచున్ రాణల్ పిసాళించినన్.

అట్టులే పక్ష్మరాక్షియుగ మార్చికనుంగొనె సూచికాగ్రముల్
నిట్టనిగుడ్చి చూడ్కు లవనీసురనందనుఁ డంతలోన క
న్పట్టవ చిన్నెలెవ్వియు, అనంగ తురంగము చూతవృక్షపుం
జిట్ట చిటారుకొమ్మపయిఁజేరి కికాకిక పల్కె వెన్కయై.

వెనుదిరిగి చూడ సైతవాహిని తటమ్ము,
గుమ్మగారసాల వనమ్ము క్రమ్ముకొను శు
కపిక బర్హిణ నిర్హ్రాద కల కలమ్ము
స్వప్నమున బోలె నెదుట సాక్షాత్కరించె.

## సంగ్రహ ప్రకటనలు

### ఆధునిక భాషల అభివృద్ధి

హిందీ, సంస్కృత భాషలు మినహా ఆధునిక భారతీయ భాషల అభివృద్ధికి సంబంధించిన ఒక పధకాన్ని భారత ప్రభుత్వ శాస్త్రీయ పరిశోధన, సాంస్కృతిక వ్యవహారాల మంత్రిత్వశాఖ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో రూపొందించింది. ఈ పధకం క్రింద విజ్ఞాన సర్వస్వగ్రంధాలు, విజ్ఞానగ్రంధాలు, ద్విభాషా నిఘంటువులు, విజ్ఞాన శాస్త్రం, సంస్కృతికి సంబంధించిన రచనల ప్రచురణలు మొదలైన వాటిని గుర్తించారు. ఈ పధకం తృతీయ ప్రణాళికా కాలంలో కూడా కొనసాగుతుంది.

పైన తెలిపిన ఆధునిక భాషల అభివృద్ధికి సంబంధించిన కార్యక్రమంలో నిమగ్నమైవున్న సంస్థలకు ఈ పథకం క్రింద సహాయం పొంద డానికి అర్హతవున్నది. ఇట్టి సహాయాన్ని కోరే దరఖాస్తులను. ఆయా రాష్ట్ర ప్రభుత్వాల ద్వారా పంపాలి.

### ప్రాంతీయ సైనికోద్యోగులు

ఆంధ్రప్రదేశ్‌లోని లోక్ సహాయక సేన, ప్రాంతీయ సైన్యానికి చెంది రాష్ట్ర సలహా సంఘం సిఫార్సు చేసిన ప్రకారం — బొల్లారంలో 971 లైన్ కన్‌స్ట్రక్షన్ సిగ్నల్ విభాగం (టిపి) (పి మరియు టి) లోని ఆఫీసర్ కమాండింగ్‌కు 1962—63 ఆర్థిక సంవత్సరం నుంచి ప్రతి యేటా రెండువందల రూపాయల నివ్వడానికి ప్రభుత్వం నిశ్చయించింది. ఈ మొత్తాన్ని ప్రతియేటా అక్కడ ఏర్పాటుచేసే వార్షిక శిబిరంలో ప్రతిభ చూపించిన సైనికోద్యోగులకు కమాండింగ్ ఆఫీసర్ నిర్ణయించిన రీతిని బహుమతుల నివ్వడానికి వినియోగిస్తారు.

### శీతల గిడ్డంగుల సౌకర్యాలు

హైదరాబాద్‌లో టాంక్ బండ్‌పెద్దగల మత్స్య శాఖ భవనాలలో నాలుగు టన్నుల శీతల గిడ్డంగిని ఏర్పాటు చేశారు. ఈ గిడ్డంగిలోని కొంతభాగం పండ్లు, కూరగాయలు, చేపలతో సహా కోళ్ళు, మాంసాన్ని నిల్వచేయడానికి లభ్యమవుతుంది. ఈ సౌకర్యాన్ని వినియోగించుకోదలచిన వారు మత్స్యశాఖ డైరెక్టర్‌ను ఆఫీసు పనిచేసే వేళలలో కలుసుకొని సంప్రదించవచ్చు.

### విద్యుత్ ప్రమాదాలు

విద్యుచ్ఛక్తి ప్రమాదాలకు సంబంధించిన ఫిర్యాదులను ప్రభుత్వ చీఫ్ ఎలక్ట్రికల్ ఇన్‌స్పెక్టరుకు, ఆ ప్రాంతానికి చెందిన ఎలక్ట్రికల్ ఇనస్పెక్టరుకు 24 గంటలలోపలని వేదించాలని 1910వ సంవత్సరం భారతీయ విద్యుచ్ఛక్తి చట్టంక్రింద ప్రభుత్వం సూచనలను విడుదల చేసింది. కనుక ప్రజలు తమ ఇళ్ళలో విద్యుచ్ఛక్తి ప్రమాదాలేవైనా సంభవిస్తే ఆ విషయాన్ని వెంటనే దానికి సంబంధించిన ప్రభుత్వోద్యోగులకు 24 గంటలలోగా తెలియపరచాలి.

### జిల్లా సాంత్రికేయుల ఎక్రిడిటేషన్ కమిటీలు

స్థానిక పత్రికా విలేఖరులకు అధికార సౌకర్యాలను కల్పించే ఉద్దేశంతో ఒక్క హైదరాబాద్ జిల్లాలోతప్ప రాష్ట్రంలోని అన్ని జిల్లాలలోను ప్రభుత్వం జిల్లాపాత్రికేయుల ఎక్రిడిటేషన్ కమిటీలను ఏర్పాటు చేసింది. ఈ కమిటీలకు కలెక్టరు అధ్యక్షుడు. జిల్లా పరిషత్ అధ్యక్షుడు, స్థానిక వర్కింగ్ జర్నలిస్టుల ప్రతినిధి ఒకరు, స్థానికసంపాదకులప్రతినిధి ఒకరు ఈ కమిటీలలో సభ్యులు. జిల్లా ప్రజా సంబంధాల అధికారి ఈ కమిటీ కార్యదర్శిగా వుంటారు. కృష్ణా జిల్లాలో మాత్రం జర్నలిస్టుల తరపున ఇద్దరు ప్రతినిధులు, సంపాదకుల తరపున ఇద్దరు ప్రతినిధులు వుంటారు.

### వాణిజ్య సుంకాల పత్రాల ప్రతులు

వాణిజ్య సుంకాలకు సంబంధించిన చట్టాలు, నిబంధనలు,

ప్రకటనలు మొదలైన వాటి సవరణల ప్రతులను నిర్ణీత ధరలకు వర్తకులకు సరఫరాచేసే పథకాన్ని 1-4-1962 నుంచి ఒక సంవత్సరం పాటు కొనసాగించడానికి ప్రభుత్వం నిర్ణయించింది. రిజిస్ట్రేషన్‌కు, రిజిస్ట్రేషన్ పునరుద్దరణకు కనీసపు ఫీజు 15 రూపాయలు. ఈ విధంగా డబ్బుచెల్లించినవారకి పైపత్రాలను ఒక్కొక్క ప్రతి చొప్పున ఇస్తారు.

## హమాలీల విచారణ సంఘం

రాష్ట్రంలో హమాలీల పని వివరాలను గురించి విచారణ జరపడానికి ప్రభుత్వం ఒక సంఘాన్ని ఏర్పాటు చేసింది. ఈ సంఘంలో (1) ప్రాంతీయ ప్రావిడెంటుఫండు కమిషనర్ (అధ్యక్షుడు) (2) భారత జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ ఉద్యోగుల ప్రతినిధి శ్రీ వి. జగన్నాధరావు (3) ఉద్యోగుల ప్రతినిధి శ్రీ శ్రీధర్ వామన్ నాయక్ వున్నారు.

ఈ సంఘం తన నివేదికను సంఘం ఏర్పడిన తేదీనుంచి ఆరు నెలలలోపల లేబర్ కమిషనర్ ద్వారా ప్రభుత్వానికి సమర్పించాలి.

## ఓటర్ల జాబితాలు

శాసనమండలి పట్టభద్రులు ఉపాధ్యాయుల నియోజక వర్గాలకు చెందిన ఓటర్ల జాబితాలు తుదిసారిగా 10-1-1962 ప్రచురింపబడినవి. ఆ జాబితాలలో తమ పేర్లులేనివారు ఓటర్లుగా నమోదు కాదలచినవారు అందుకై తమ నియోజక వర్గానికి చెందిన ఎలక్టోరల్ రిజిస్ట్రేషన్ అధికారికి దరఖాస్తు పెట్టుకోవాలి. దరఖాస్తుతోపాటు 50 నయాపైసలను నాన్-జ్యుడిషియల్ స్టాంపుల రూపంలో గాని స్టాంప్ కాగితాల రూపంలో గాని చెల్లించాలి. ఈ దరఖాస్తులందగానే ఆయా, రిజిస్ట్రేషన్ అధికార్లు, వారంరోజుల లోపల వచ్చే అభ్యంతరాలను చూచి, ఆమోద యోగ్యం అయితే ఆ అభ్యర్థి పేరును ఓటర్ల జాబితాలో చేరుస్తారు.

## కళాశాలాధ్యాపకుల వేతనాలు

రాష్ట్రంలోని కళాశాలల అధ్యాపకులకు యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ వేతనాలను అమలు జరపాలని ప్రభుత్వం ఉత్తరువు జారీ చేసింది. ఈ కమిషన్ వేతనాలు పొందే అధ్యాపకులు ఈ నూతన వేతనాలను 1-3-1961 నుంచి పొందుతారు. 1-3-1961 తేదీన అమలులో వున్న కరువుభత్యం, సిటీ అలవెన్సులను కూడా వారు పొందుతారు. ఉపాధ్యాయునికి ప్రస్తుతం పొందుతున్న వేతనం ప్రకారం కమిషన్ స్కేలులో దానికి సరియైన దానికన్నా మరొక మెట్టు ఎక్కువగా వున్న మొత్తాన్ని ఇస్తారు. ఉపాధ్యాయుని ప్రస్తుతపు ప్రాథమిక వేతనం, కమిషన్ జీతాల స్కేలులో కనీసపు వేతనం కన్నా తక్కువగా వుంటే, దాని తర్వాత మెట్టులోవచ్చే వేతనం అతని రివైజ్‌డ్ గ్రేడులో కనీస వేతనమవుతుంది.

## వక్ఫ్ ఆస్తుల సర్వే

1954వ సంవత్సరం ముస్లిం వక్ఫ్ చట్టంలోని నాల్గవ విభాగం క్రింద తెలంగాణా ప్రాంతంలో వక్ఫ్ ఆస్తుల సర్వేను చేపట్టారు. ఈ సర్వేను కమిషనర్ ఆఫ్ వక్ఫ్స్ హిమాయత్‌నగర్, హైదరాబాద్-29 నిర్వహిస్తారు.

## పౌష్టికాహార కార్యక్రమం

పౌష్టికాహార పథకం క్రింద ఆంధ్రప్రదేశ్‌లో "యునిసెఫ్" (UNICEF) సహాయంతో 1960-61లో ఒక పథకాన్ని ప్రారంభించారు. ఈ పథకం క్రింద వారానికి రెండుసార్లు చేపలను, గుడ్లను ఉచితంగా పంచి పెట్టడానికి రాష్ట్రంలోని ప్రతిజిల్లాలో ఒక్కొక్క బ్లాకులో పది గ్రామాలను నిర్ణయించారు. ఈ పథకం వల్ల 1962-63 సంవత్సరంలో పశ్చిమ గోదావరి, కృష్ణా, అనంతపూర్, ఖమ్మం, కరీంనగర్, ఆదిలాబాద్, మహబూబ్‌నగర్ హైదరాబాదు జిల్లాలలోని ఎనిమిది బ్లాకులు ఈ లాభాన్ని పొందుతాయి

## అడ్వాన్స్ పింఛనుల ఆపివేత

ఇప్పటి వరకు అమలులోవున్న- 10 రూపాయిల లోపు పింఛనులను ముందుగా ఇచ్చే పద్ధతిని ఆపివేయడానికి ప్రభుత్వం నిర్ణయించిందని హైదరాబాద్‌లోని పెన్షన్ల చెల్లింపు కార్యాలయం ఆఫీసర్-ఇన్-చార్జి-ప్రకటిస్తున్నారు.



# వాల్మీకిలో సందేహాలు

డాక్టర్ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

విజయనగర సామ్రాజ్య ప్రాంతములో కిష్కింధ ఉండేదని అంటారు. కిష్కింధ ఇదేనా అనే విషయము చర్చనీయము జటాయువు రావణుడు వెళ్ళిన దిక్కునుచూపి ఉంటుంది. రావణుని పేరుమాత్రం చెప్పిందికాని, ఈ రావణుడెవరు? ఎక్కడివాడు? ఎచ్చట పాలిస్తున్నాడు? అనే విషయాలు జటాయువుకు తెలియవు. రావణునితో కొస్త పరిచయమున్నా ఈ సంగతులు తెలియవంటే నమ్మటం కష్టమే. సుగ్రీవుడు, వాలికూడా రావణుని గూర్చి విన్నారుకాని, ఆతడే దిక్కులో ఉండేదీ వీరికీ తెలియవు. అందుచేతనే వానరులు నాలుగు దిక్కులకూ బయలుదేరినారు సీతను వెదుకుతూ. ఇంత అజ్ఞాతవాసంలో ఉన్నవాడు కాదు రావణుడు. రామలక్ష్మణులు గోదావరిలో జటాయువుకు జలాంజలి ఇచ్చి, సుగ్రీవుని చేరటానికి పడమరగా పోయి

తేపుష్కరేణ్యాః పంపాయాస్తే రమాసాద్య పశ్చిమమ్
అపశ్యతాంతతస్తత్ర శబర్యారమ్యమాశ్రమమ్

పంపా సరస్సు పశ్చిమ తీరంచేరి శబరి యొక్క ఆశ్రమాన్ని చూచినారు. అక్కడ ఉన్నప్పుడు ఋష్యమూక పర్వతం నుంచి హనుమంతుడు వీరిని చూచినాడు. పశ్చిమంగా పోయినవాళ్ళు పంపా సరస్సు తూర్పుతీరం చేరటానికి బదులు పశ్చిమతీరం చేరటము ఆశ్చర్య కరమైనదే

సుగ్రీవుడు దక్షిణదిక్కుగా పంపిన వానరులు చాలా దేశాలనుచూడటం తటస్థించింది.

సహస్రశిరసం వింధ్యాం నానాద్రుమలతాయుతమ్
నర్మదాంచనదేం రమ్యాం మహోరగనిషేవితామ్
తతో గోదావరీం రమ్యాం కృష్ణవేణీం మహానదేమ్
మేఖలానుత్కలాంశ్చైవ దశార్ణ నగరాణ్యపి

అని చాలా శ్లోకాలున్నవి. కిష్కింధనుంచి దక్షిణంగా పోయిన వానరులు చూచిన నదీనగర దేశాలలో వింధ్య, నర్మద, గోదావరి, కృష్ణ, ఉత్కల, దశార్ణదేశములు, అవంతి, విదర్భ, మహిషిక, కళింగ, కౌశిక, దండకారణ్య, ఆంధ్ర, పుండ్ర, చోళ, పాండ్య, కేరళ, కావేరి, తామ్రపర్ణి మొదలైన వున్నవి. ఆతర్వాత సముద్రాన్ని చూశారు

తతః సముద్రమాసాద్య సంప్రధార్యాథ నిశ్చయమ్
అగస్త్యేనాంతరేతత్ర సాగరే వినివేశితః
చిత్రసానుమయః శ్రీమాన్ మహేంద్రఃపర్వతోత్తమః

అని వాల్మీకి. సముద్రానికి అవతల మహేంద్ర పర్వము కూడా ఉన్నది. కళింగలో ఈ మహేంద్ర పర్వతమున్నదని కాళిదాస రఘువంశంలోని మాట. ఈ ప్రాంతాలన్నీ విజయనగరానికి దగ్గరగల పంపా సరోవరానికి దక్షిణాన ఉన్నవంటే పంపాసరస్సు వింధ్య పర్వతాలకు ఉత్తరంగా ఉండాలి. దారిమరిచిపోతే ఒక తపస్విని

ఏషవింధ్యోగిరిః శ్రీమాన్ నానా ద్రుమలతాయుతః
ఏషప్రస్రవణః శైలరిసాగరోऽయం మహోదధిః

అని సముద్రతీరానికి తీసికొని పోయిందట. వింధ్య పర్వతాలను ఆనుకొని ఉన్నదా సముద్రము.

వాస్తవికింగాభూగోళ పరిస్థితులను తెలిసికొని వాల్మీకి వ్రాసినట్లైతే కిష్కింధ వింధ్య పర్వతాలకు ఉత్తరంగా ఉండనాలి. తాపసులకు రాక్షసులు చేసే కష్టాలుకూడా పంపానది, మందాకిని, చిత్రకూటముల మధ్య దేశములోనే అని చెప్పబడినది.

పంపానదీ నివాసానామనుమందాకినీమపి
చిత్రకూటాలయానాంచ క్రియతేకదనం మహత్

అన్నాడువాల్మీకి. పంపానదికి పశ్చిమతీరానికి దగ్గరగా వానరులున్నారని ఇదివరకే గమనించాము సంపాతి వీరిని కలిసికొనినపుడు

ఇతఃస్తోకహం ప్రపశ్యామి రావణం జానకీంతథ–ఇక్కడ ఉండే రావణుని, జానకిని చూచుచున్నాను అని పల్కినాడు అంటే లంకకు కూడా వింధ్య పర్వతాలకు దగ్గరగానే ఉన్నదని భావము.

మధ్య ప్రదేశములోని అడవి జాతులలో ఉరాంవ జాతి ఉన్నది అర్పా నదీతీరంలో అమర కంటకము దగ్గరగా ఉన్న వీరినే వనరా ఊం అని కూడా అంటారని శరచ్చంద్రరాయ్ భావించినాడు. అమరకంటకానికి ఏడు మైళ్ళదూరంలో శబరీ నారాయణమున్నది. దీనికి రెండు మైళ్ళలో ఖరునివాస భూమి అని స్థానికులచే చెప్పబడు ఖరోంద్ కూడా ఉన్నది. ఈ స్థలాలన్నీ ఛత్తీస్గఢ్ ప్రాంతంలోని బిలాసపూరు జిల్లాలో ఉన్నవని అంగీకరిస్తే, జబల్పూరుకు వాయువ్యంగా నూరు మైళ్ళలో ఉన్న సాగర్ నగరమే వాల్మీకి చెప్పిన "సాగరోऽయం మహోదధిః" అని చెప్పాలి, పెద్ద సరస్సు ఉండడంచేత అక్కడి నగరాన్ని సాగర్ అన్నారు.

కాని సీతను గోదావరీ తీరమున ఉండగా రావణుడు అపహరించెనని వాల్మీకి. ఎక్కడ గోదావరి? ఎక్కడ సాగర్? ఐదు వందల మైళ్ళదూరమైనా వీటిమధ్య ఉన్నది. ఛోటానాగపూర్ దగ్గరకల అడవులలో నివసించే గోండులు రావణ వంశీయులమని చెప్పికొంటారు. వీరు, ఉరాంవులు ప్రక్కప్రక్కల నివసించే జాతులౌతారు.

వానర రాజ్యంలో నాగరకత బాగా ఉండేదని వాల్మీకి అన్నాడు రాజ్యకార్యనిర్వహణను ఉత్తమంగా జరిపే మంత్రిమండలి వారికి ఉన్నది. వానరులలో గొప్పశిల్పులు, మహా పరాక్రమవంతులు, రాజనీతి విశారదులు, యుద్ధకోవిదులు ఉన్నారు. వీరి రాజ్యానికి సమీపంలో రావణాసురుడున్నా, వీరికి తెలియకపోవటం చిత్రమే. రాముడు జనస్థానంలో పన్నెండు సంవత్సరాలున్నా, అచ్చటి ఋష్యాదుల కెవరికీ రావణుని గూర్చి తెలియకపోవటము ఆశ్చర్యకరమే.

వీటిని గమనించితే వాస్తవికమైన భూగోళ పరిస్థితులకు వాల్మీకి వాక్యాలకు సంబంధము లేదనవలసి వస్తుంది. భావనాజగత్తుకు చెందిన భూగోళమే వాల్మీకి అవలంబించెననాలి లేకపోతే భూతత్త్వవేత్తలు చెప్పే లెమూరాఖండమున్న రోజులనాటి భూగోళమే వాల్మీకిలో కనిపిస్తుందనవచ్చును.

రావణుని గూర్చి విశేషాలు గమనించటం అవసరము. అంగ (సుమాత్ర), యవ (జావా) మలయ, శంఖ (బోర్నియో) కుశ (ఆఫ్రికా), వరాహ (మడగాస్కర్), మొదలగు ద్వీపాలన్నిటినీ జయించిన లంకాధిపతి రావణుడు. అంతకు ముందున్న లంకాధిపతి యక్షరాజగు కుబేరుడు. విశ్రవునికి కైకసి యందు రావణుడు, భరద్వాజ పుత్రియందు కుబేరుడు జన్మించారు. ఒకనికి రాక్షసుడని, మరొకనిని యక్షుడని అన్నారు. రావణుడు శైవుడు, వేదభాష్య కర్త కూడాను. రావణభాష్యం కృష్ణ యజుర్వేదములోని తైత్తిరీయ సంహితకు ఉన్నది తైత్తిరేయులు ఆంధ్ర తమిళ దేశములలో చాలా ఎక్కువగాను, మహారాష్ట్రమున స్వల్పముగాను ఉన్నారు. అటువంటప్పుడు భారతదేశానికి దక్షిణంగా రావణుని నివాసాన్ని సూచించటం సమంజసము కాదు.

## రచయితలకు మనవి

పెద్దపెద్ద కథలు నాటికలు, సాహిత్య వ్యాసాలు కొందరు రచయితలు పంపుతున్నారు. ఒక్కొక్కసారి యీ రచనలు 10–30 పుటలు దాటుతున్నవి. అచ్చులో 4 లేదా 5 పుటలకు మించని ఉదాత్తమైన రచనలు పంపితే వాటిని వీలైనంత త్వరలో ప్రచురించడానికి అవకాశం వుంటుంది–కాబట్టి రచయితలు ఈ విషయాన్ని దృష్టిలో వుంచుకొని మాతో సహకరించ గోరుతున్నాము.

–ఎడిటర్
ఆంధ్రప్రదేశ్ (తెలుగు)

# కర్నూలు-కడప కాలువ

కర్నూలు_కడప కాలువ, తుంగభద్ర నదికి అడ్డంగా నిర్మించిన సుంకేసుల ఆనకట్ట వద్ద నుంచి ఆరంభమవుతుంది. ఈ ఆనకట్ట కర్నూలుకు పశ్చిమ దిశన 18 మైళ్ళ దూరంలో వుంది.

కాలువ మొత్తం నిడివి 189 మైళ్ళు. కర్నూలు జిల్లాలో 145 మైళ్ళ పొడవున, కడప జిల్లాలో 44 మైళ్ళ పొడవున ఇది ప్రవహిస్తుంది. కర్నూలు జిల్లాలోని నందికొట్కూరు, నంద్యాల ఆళ్ళగడ్డ, సిర్వేల్, కోయిలకుంట్ల, కర్నూలు తాలూకాలకూ కడప జిల్లాలోని ప్రొద్దుటూరు, జమ్మలమడుగు, కడప తాలూకాలకు ఇది నీటి పారుదల చేస్తుంది.

సుమారు ఒక శతాబ్దానికి పూర్వం 1870 వ సంవత్సరంలోనే దీని నిర్మాణం జరిగింది. కాని నిర్వహణ సరిగా లేకపోవడం వల్ల కాలువ పూడిపోయి నిర్దేశించిన మేరకు నీటి సరఫరా జరగడం లేదు.

## మరమ్మతులు

1955_1958 వ సంవత్సరాలలో ఈ కాలువను పునర్నిర్మించారు. 3,000 క్యూసెక్కుల నీరు ప్రవహించడానికి వీలుగా మొదటి 75 మైళ్ళ వరకు కాలువను వెడల్పు చేయడం ద్వారా, కాంక్రీటు లైనింగ్ చేయడం ద్వారా దీనిని అభివృద్ధి పరిచారు.

1959_1960 వ సంవత్సరాలలో 75 వ మైలు నుంచి కాలువ చివరివరకు ప్రధాన కాలువ, పంపిణీ కాలువల పునర్నిర్మాణం కూడా జరిగింది. (పూర్తి పథకానికి జరిగిన వ్యయం సుమారు రూ. 6 కోట్లు.)

ఈ కాలువ క్రింద 2,78,000 ఎకరాలకు నీటి పారుదల చేయడానికి ఇప్పుడు నిశ్చయించారు. ఆయకట్టు వివరాలు దిగువ ఇవ్వబడినవి.

| | | |
|---|---|---|
| చెరకు | ... | 14,000 ఎకరాలు |
| తరీ రెండు పంటలు | ... | 10 000 ఎకరాలు |
| మాగాణీ ఒక పంట | ... | 1,26,000 ఎకరాలు |
| నీటి పారుదలగల మెట్ట | ... | 1,28,000 ఎకరాలు |
| | మొత్తం | 2 78 000 ఎకరాలు |

కె సి. కాలువను అభివృద్ధిపరచడానికి పూర్వం దిగువ విధంగా 96,782 ఎకరాలకు మాత్రమే ఈ కాలువ నీటి పారుదల చేసేది.

| | | |
|---|---|---|
| మాగాణి | ... | 38 402 ఎకరాలు |
| నీటి పారుదలగల మెట్ట | ... | 38,380 ఎకరాలు |
| | మొత్తం | 76 782 ఎకరాలు |

కాలువను అభివృద్ధి పరిచిన తరువాత ప్రస్తుతం కర్నూలు జిల్లాలో మొత్తం 156148 ఎకరాల భూమి బాగుపడింది.

వివరాలు ఇవి :_

| | | |
|---|---|---|
| మాగాణి | ... | 53 006 ఎకరాలు |
| నీటి పారుదలగల మెట్ట | ... | 103,142 ఎకరాలు |
| | మొత్తం | 156148 ఎకరాలు |

1371 ఫసలీలో (1961_62 సం. ఆఖరుకు) 2 లక్షల ఎకరాలు అభివృద్ధి పొందగలదని అంచనా.

189 మైళ్ళ పొడవు గల కె సి. కాలవ హైడ్రాలిక్ వివరాలు ఇవి:_

## కాలవ శీర్ష విభాగం

| | |
|---|---|
| కాలవ గర్భం వెడల్పు | 90'-0 అడుగులు |
| నిండుగా పారుచున్నప్పుడు లోతు | 9'-0 అడుగులు |
| ప్రక్కల ఏటవాలు | $1\frac{1}{2}$ నుంచి 1 అడుగు వరకు |
| కాలవ గర్భపాతం | మైలు 1 కి 4 అంగుళాలు |
| కో-ఎఫ్ సెంట్ రుగా సిటీ | 0 016 |
| నీటి విడుదల | 3000 క్యూసెక్కులు |

మొదటి 75 మైళ్ళ వరకు మాత్రమే సిమెంటు కాంక్రీటు లైనింగు వేయడం జరిగింది. కాంక్రీటు నిష్పత్తి 1:4:8 కాలవ గర్భానికీ ప్రక్కలకూ 4 అంగుళాల ఉళసరిలో సిమెంటు కాంక్రీటు వేయడం జరిగింది.

## ఆయకట్టు వివరాలు

ఇరిగేషనుకు పూర్వం కె.సి. కాలవలో అభివృద్ధి పనులు జరిగినాయి. వివరాలు ఇవి :-

| | తరి | నీటి పారుదలగల మెట్ట | మొత్తం |
|---|---|---|---|
| కర్నూలు జిల్లా | 15,992 | 37,494 | 53 486 |
| కడప జిల్లా | 22,480 | 22,887 | 43,367 |
| | 38,472 | 58,381 | 96,853 |

అభివృద్ధి చెందిన తరువాత ఇప్పుడు తలపెట్టిన ఇరిగేషన్ వివరాలు :

| | కర్నూలు జిల్లా (ఎకరాలలో) | కడప జిల్లా (ఎకరాలలో) | మొత్తం (ఎకరాలలో) |
|---|---|---|---|
| చెఱకు | 14 000 | ... | 14,000 |
| మాగాణి రెండుపంటలు | 6,571 | 3,429 | 10,000 |
| మాగాణి ఒక పంట | 65,856 | 60 144 | 1,26,000 |
| నీటిపారుదలగల మెట్ట | 98,460 | 29,540 | 1,28 000 |
| మొత్తం ఎకరాలు | 1,84,887 | 93 113 | 2,78 000 |



కొమ్మలను చెక్కివేసెడి కొలది, నతివ!

ఈలచెట్టు అకసమున కెదిగిపోవు,

అలరు పుడికిన కొలది తేయాకు మొక్క

విమల పరిమళముల మించి విస్తరించు.

"మధుగీత"

# పంచాయతీరాజ్య పురోగమనం

### రసాయనికపు ఎరువుల పంపకం

తూర్పు గోదావరి జిల్లా పెద్దాపురం పంచాయతీ సమితిలో ఈ సంవత్సరం ఫిబ్రవరి నెలలో 3840 మణుగుల మేలురకం విత్తనాలను, 2298 మణుగుల రసాయనికపు ఎరువులను, పచ్చి ఎరువులను పంచిపెట్టారు.

### గ్రంథాలయాలకు విరాళాలు

గ్రంథాలయానికి పుస్తకాలను, భజన సామగ్రి మొదలైన వాటిని కొనడానికి కర్నూలు జిల్లా నంద్యాల పంచాయతీ సమితిలోని ప్రజలు గత ఫిబ్రవరి నెలలో 3761 రూపాయలను విరాళంగా ఇచ్చారు.

### మధ్యాహ్న భోజన కేంద్రాలు

నెల్లూరు జిల్లా కొండపి పంచాయతీ సమితిలోని ఆరు గ్రామాలలో మధ్యాహ్న భోజన కేంద్రాలను గత ఫిబ్రవరిలో ప్రారంభించారు. ఈ కేంద్రాలకయ్యే వ్యయాన్ని స్థానిక ప్రజలు, సమితి భరిస్తాయి.

### విద్యుత్ మోటారు పంపు సెట్లు

నిజామాబాద్ జిల్లా ఆర్మూరు పంచాయతీ సమితిలో నీటి పారుదలకై గత మార్చి నెలలో 15 విద్యుత్ మోటారు పంపు సెట్లను నెలకొల్పారు.

### కొత్త బావులకు సబ్సిడీలు

నీటి పారుదల కుపయోగించే కొత్త బావుల నిర్మాణానికై టంకాల పంచాయతీ సమితి (అనంతపురం జిల్లా) గత మార్చిలో రూ. 30,000 లను సబ్సిడీలుగా ఇచ్చింది.

### పాఠశాల భవనం ప్రారంభం

అనంతపురం జిల్లా పుట్లూరు పంచాయతీ సమితిలోని బొప్పపల్లి గ్రామంలో మూడు వేల రూపాయల ప్రజల విరాళాలతో నిర్మించిన పాఠశాల భవనాన్ని గత మార్చి నెలలో ప్రారంభించారు.

### యువజనోత్సవం

కొండపిలో పంచాయతీ సమితి ఆధ్వర్యాన గత మార్చి నెలలో ఒక యువజనోత్సవం జరిగింది. వ్యాసరచన, వక్తృత్వపు పోటీలు, ఆటల పోటీలు నాటకాల పోటీలు నిర్వహించబడినాయి.

### భూమి స్వాధీనం

కర్నూలు జిల్లా రుద్రవరం పంచాయతీ సమితిలో సేద్యం చేయబడని 66 ఎకరాల భూమిని గత ఫిబ్రవరిలో స్వాధీనం చేసుకున్నారు.

### పశు వైద్య ప్రథమ చికిత్సా కేంద్రం

కడప జిల్లా పెండ్లిమర్రి పంచాయతీ సమితికి చెందిన అంబవరంలో ఒక పశు వైద్య ప్రథమ చికిత్సా కేంద్రాన్ని ఇటీవల ప్రారంభించారు

### మశూచి నిరోధక టీకాలు

చిత్తూరు జిల్లా నగరి బ్లాకులో గత ఫిబ్రవరి నెలలో 315 మందికి మశూచి నిరోధక టీకాలను వేశారు.

## రాష్ట్రంలో

22 మార్చి:—రాష్ట్ర ఆర్థిక శాఖా మంత్రి 2.13 కోట్ల రూపాయల లోటు బడ్జెటును అసెంబ్లీలో సమర్పించారు.

27 మార్చి:—1961 వ సంవత్సరంలో సింగరేణి బొగ్గుగనుల పనికి సంబంధించిన వార్షిక నివేదికను ముఖ్యమంత్రి శాసన మండలిలో నివేదించారు.

1 ఏప్రియల్:— నూతన శాసన సభా ప్రథమ సమావేశం నిరవధికంగా వాయిదా పడింది

2 ఏప్రియల్:— సింగరేణి కాలరీలపై కంట్రోలును రాష్ట్ర ప్రభుత్వానికి ఇవ్వాలని అనుమతించవలసిందిగా భారత ప్రభుత్వానికి వ్రాయటానికి రాష్ట్ర మంత్రివర్గం నిర్ణయించింది.

6 ఏప్రియల్ — పర్మిట్లు లేనివారు సరుకులు అమ్మకం పన్ను విధించే ఆంధ్ర ప్రదేశ్ అమ్మకం పన్ను చట్టంలోని విధానాన్ని రాజ్యాంగరీత్యా చట్ట సమ్మతమైనట్లుగా సుప్రీంకోర్టు సమర్థించింది.

14 ఏప్రియల్:— న్యాయ, సమాచార శాఖల మంత్రి శ్రీ పి. వి. నరసింహారావు కరీంనగర్‌లో జిల్లా సమాచార కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు

16 ఏప్రియల్:— విజయవాడనుంచి విశాఖపట్నం, హైదరాబాద్ నగరాలకు విమానసర్వీసును 13 సంవత్సరాల తర్వాత తిరిగి ప్రవేశ పెట్టారు

## భారత దేశంలో

30 మార్చి:— రెండవ పార్లమెంటు 5 సంవత్సరాల కాలపరిమితి పూర్తి అయింది.

31 మార్చి:— వచ్చే సంవత్సరానికి సంబంధించిన దిగుమతి విధానాన్ని భారత ప్రభుత్వం ప్రకటించింది. రెండవ లోకసభ రద్దు అయ్యింది.

1 ఏప్రియల్:— భారత వైమానిక దళం 29 వార్షికోత్సవం జరిగింది.

10 ఏప్రియల్:— నూతన కేంద్ర మంత్రి వర్గ సభ్యులచేత రాష్ట్రపతి భవన్‌లో రాష్ట్రపతి ప్రమాణ స్వీకారం చేయించారు.

14 ఏప్రియల్:— ప్రముఖ ఇంజనీరు, రాజకీయవేత్త అయిన డాక్టర్ యం. విశ్వేశ్వరయ్య మరణించారు.

16 ఏప్రియల్:— కొత్తగా నియమితులైన 16 మంది కేంద్ర మంత్రులు—ఆరుగురు స్టేట్ మంత్రులు, 11 మంది డిప్యూటి మంత్రులు—పదవీ స్వీకారం చేశారు.

స్వీకారానికి సమావేశమయ్యారు.

17 ఏప్రియల్:— సర్దార్ హుకుంసింగ్ లోక సభ స్పీకర్ పదవికి ఏకగ్రీవంగా ఎన్నికైనారు.

రాజ్య సభ సభ్యులు ప్రమాణం స్వీకారం చేశారు.

18 ఏప్రియల్:— రాష్ట్రపతి మూడవ పార్లమెంటులో ప్రారంభోపన్యాసాన్ని, పిదోప్యుల ప్రతి గాన్ని చదివారు.

19 ఏప్రియల్:— చైనా ఇటీవల భారత దేశంలోకి మరికొంత చొచ్చుకు వచ్చినట్లు ప్రభుత్వానికి తెలిసిందని విదేశాంగ వ్యవహారాల కేంద్ర మంత్రిణి శ్రీమతి లక్ష్మీమీనన్ లోక సభలో తెలిపారు.

## విదేశాలలో

25 మార్చి:— భూ గర్భంలో జరిగే అణ్వాస్త్ర పరీక్షలకు అనుగొనే నూతన బ్రిటన్ విధానం అమలులోకి వచ్చింది

26 మార్చి:— అమెరికా, ఇండియాల మధ్య విమాన సర్వీసును పెంపొందించడానికై ఈ రెండు దేశాలు ఒక సామాన్య ఒప్పందాన్ని కుదుర్చుకొన్నాయి

28 మార్చి:— ఎటువంటి రక్తపాతం లేకుండా సిరియాలో ప్రభుత్వాన్ని సైనిక దళం హస్తగతం చేసుకొంది.

9 ఏప్రిల్:— అల్జీరియా విధానంలోనేకాక, ఏప్రిల్ 8 వ తేదీన దేశ వ్యాప్తంగా జరిగిన ప్రజాభిప్రాయ సేకరణ (రిఫరెండం)ను ఆదరించడానికి నిర్ణయించడంవల్ల కూడా ప్రెసిడెంట్ డిగోల్ అఖండ విజయాన్ని సాధించారు.

10 ఏప్రియల్:— అంతర్జాతీయ అజమాయిషీ క్రింద సార్వత్రిక నిరాయుధీకరణ జరగాలన్న ఒప్పందంలోని మూడింటరెండు వంతుల సూత్రాలను 17 రాజ్యాల నిరాయుధీకరణ మహాసభ ఆమోదించింది.

14 ఏప్రియల్:— ఫ్రెంచి ప్రధాన మంత్రి శ్రీ మైఖల్‌డెబ్రీ తన పదవికి రాజీనామా ఇస్తూ రాజీనామా పత్రాన్ని ప్రెసిడెంట్ డిగోల్‌కు అందజేశారు

15 ఏప్రియల్:—అణ్వస్త్ర పరీక్షల నిషేధ ప్రతిష్టంభనను తొలగించడానికి ఎనిమిది తటస్థ రాజ్యాలు ఒక రాజీ పథకాన్ని సిద్ధం చేశాయి దీన్ని గురించి ఆలోచించడానికి రష్యా, అమెరికాలు వాగ్దానం చేశాయి.

19 ఏప్రియల్:—ఏప్రిల్ నెలలో తను అమెరికా అధ్యక్షుడిని కలుసుకొన్నప్పుడు ఆయనతో ప్రాక్పశ్చిమ రాజ్యాల శిఖరాగ్ర సమావేశానికి సంబంధించిన సమస్యను ప్రస్తావించగలనని బ్రిటన్ ప్రధానమంత్రి తెలిపారు.

# సౌందర్యలహరి

డాక్టర్. బూర్గుల రామకృష్ణరావు

(గత సంచిక తరువాయి)

అనయముభర్త సద్గుణకథాలి జపమ్మొనరించుచుండి. యో
జననీ! జపాసుమారుణరుచమ్మగు నీరసనమ్ము మిన్నయై
దనర, తదగ్రభాగమునఁదాండవ మాడువిశుద్ధ మూర్తివా
గ్వనిత సుధాచ్ఛసుస్ఫటిక వర్ణము మాటెడి మానికమ్ముగన్

దురమునఁగెల్చిరక్కసులఁ దోరపునుబ్బున మ్రొక్కవచ్చి, యా
హరిహరులున్ గుమారుఁడురయమ్మున వాపిశిరస్త్రవర్మముల్,
హరునిప్రసాద మొప్పమి సుధాకర నిర్మలగ ధసార సుం
దరమగు నీదుతమ్ములపుఁదమ్మిఁ దమింగ్రసియింతు రమ్మరో

పలుకువెలంది వీణపయిఁబాడగ నీప్రియుగాథలెన్నొ. నీ
వలరి సెబాసటంచు శిరమల్లనసూచుచుఁబల్కనంత, త్వ
త్సఁలిత సూక్తిసంపదకుఁ జాలకపశ్రుతియైన వీణియన్
బలుకక చాఁటుగా నిచుళబద్ధమొనర్చుచు కప్పిపెట్టెడిన్

వలిమలరాజు వత్సలతఁబట్టి కరాంగులిపుణ్క; మాటిక
ర్మిలి నధరామృతమ్ము గొనురీతిని శంకరుడెత్తు; నాతఁడి
మ్మల భవదాస్యదర్పణము పూనఁగగేలను నువృంతమేయనన్
బొలుపగునట్టినీచిబుకమున్ సరిచెప్పనుతింపశక్యమే?

పురహరు బాహుబంధములఁ బొల్చిన నీపులకాంకురాంకవి
స్ఫురితగళంబు త్వద్వనపుల్ల సరోజమృణాళకాండమై
మెరయగ, దానిక్రిందరుచిమించెడి హారము తెల్లనయ్యెఁదా
మరలత పోల్కిదానగరు పంకమునందునమాసిపోయెడిన్

గతిగమక ప్రగీతచణ, గౌరి! వివాహమహోత్సవాననీ
పతిమెడఁ తాళి గట్టిపిదపన్ దగఁ బూన్చిన మూడునూళ్ళనున్
స్మృతిఁ దలపించు నీదుగళ సుందరరేఖలు. సర్వరాగ సం
గతముల మూడుగ్రామములఁ గ్రాలెడి సీమలనంగ వెల్గెడిన్

మునుపాకశీర్షమున్ నరికి మొత్తిన రుద్రునివాఁడిగోళ్ళకున్
దనకుచభీతిచే నలువతక్కగునాల్గిటిఁ గావనెంచి. యో
జనని! మృణాలకోమల భుజమ్ములు నాల్గ భయమ్మొసంగునం
చనిశము సన్నుతుల్ సలుపునందము మెచ్చుచు నాల్గుమోములన్

అరుణనఖద్యుతిన్ దరుణహల్లకరాగము నవ్వుసీకర
స్ఫురితనవారుణ ప్రభలసొంపదియేమన నేర్తుమౌర! ఆ
సరసిజమచ్చటన్ మసలుసారసగేహ పదారవిందవి
స్తరమగులత్తుకంబెరసి సామ్యముచెందిన చెందునెట్టులో॥

కనుఁగొనివేని శంకగొని, కన్గొనువారలు నవ్వగా, గజా
ననుఁడు స్వకీయకుంభములనమ్మికకై తడవుం గరమ్మునఁ
జనని! గుహద్విపాస్యులిరుచాయల నిర్వురు పాలుద్రావునీ
స్తనయుగమస్మదీయపరితాపమువాపుత ప్రస్నుతాగ్రమై॥

నగపతి వంశకేతన! మనంబున శంకయలేదు. చెప్పగా
దగును భవత్కుచమ్ము లమృతంబునునించిన కెంపుసిద్దెలే
యగును; గజాస్యషణ్ముఖులనాదిగ నీచనుఁబాలుద్రావుటన్
విగతవధూప్రసంగులయి వీడరుబాల్యము నేటికిన్ గదే!

గజదనుజేంద్రకుంభ పరిఘట్టనదుల్లిన స్వచ్ఛమౌక్తిక
వ్రజరచితాచ్ఛహారము భవత్కుచమండలి నొప్పునమ్మ న
క్కజముగ నీదుబింబఫలకాంతిఁ జెలంగెడి మోవిరంగులన్
భుజబల విక్రమారుణిమ పూనిన రుద్రునికీర్తి కైవడిఁ

(సశేషం)

# పారిశ్రామిక విశేషాలు

(1962 మార్చి)

[రాష్ట్రపారిశ్రామిక రంగంలో అనుదినం అభివృద్ధి పథకాలు ప్రవేశ పెట్టబడుతున్నాయి. పారిశ్రామిక వేత్తలు ప్రజలు వాటిని గురించి తెలుసుకొనటం అవసరం అనే దృష్టితో ముఖ్యపారిశ్రామిక విశేషాలు యీ శీర్షక క్రింద ఇవ్వబడుతున్నవి.]

## కేంద్రప్రాజెక్టులు

కేంద్ర ప్రాజెక్టులైన సింథటిక్ ఔషధాల ఫ్యాక్టరీ, భారీ విద్యుత్ పరికరాల కర్మాగారాల నిర్మాణానికి సివిల్ పనులు చురుకుగా కొనసాగుతున్నాయి.

## ప్రైవేటు రంగం

ఐయన్ ఓ నికొటానిక్ యాసిడ్, టొల్బుటమైడ్: పాంపొడి- వీటిని ఉత్పత్తి చేయడానికి ప్రైవేటు సంస్థలకు లైసెన్సులు ఇవ్వబడినాయి.

తేలిక, మధ్యరకం బాడీలు, ఉక్కు ట్రాన్స్‌మిషన్ల టవర్ల ఉత్పత్తికి హైదరాబాదులో ఒక కర్మాగారాన్ని నెలకొల్పుటకు కూడా ప్రైవేటు సంస్థకు లైసెన్సు ఇవ్వబడింది.

## మధ్యరకం పరిశ్రమల స్థిరత్వ పద్ధతి మార్పు

రూ. 10 లక్షల విలువకు మించని నిశ్చిత ఆస్తులు గల పారిశ్రామిక సంస్థలు వాటిలో పనిచేసే వ్యక్తుల సంఖ్యతో నిమిత్తం లేకుండా 1951 నంబరు పరిశ్రమల (అభివృద్ధి మరియు క్రమబద్ధం) చట్టం క్రింద లాంఛనప్రాయంగా లైసెన్సు పొందవలసిన అగత్యం లేకుండా వానిని మినహాయించుటకు భారత ప్రభుత్వం నిర్ణయించింది. పారిశ్రామికవేత్తలు సంస్థలను నెలకొల్పుటకు ముందు భారత ప్రభుత్వ వాణిజ్య పరిశ్రమల శాఖలోని అభివృద్ధి విభాగంతో సంప్రదించాలని వారికి సలహా ఇవ్వడమవుతున్నది.

## బొగ్గు పరిశ్రమ

ప్రభుత్వ కంపెనీ అయిన సింగరేణి బొగ్గుగనుల ఉత్పత్తి క్రమేణా పెరుగుతున్నది. 1962 ఫిబ్రవరి నెలాఖరు వరకు జరిగిన ఉత్పత్తి 4,78,743 8 టన్నులు గత సంవత్సరం ఇదే కాలానికి జరిగిన ఉత్పత్తి 4 36,676 టన్నులు.

## చక్కెర పరిశ్రమ

నిజాం చక్కెర ఫ్యాక్టరీ (లిమిటెడ్) విస్తరణ కార్యక్రమం పూర్తి కావడంతో ఇందులోని రెండు యంత్రాలు కలిసి 1692 మార్చి నెలలో 92 147 టన్నులు చెఱుకును ఆడాయి. వేతన నిర్ణాయక సంఘం సిఫార్సులు ఈ ఫ్యాక్టరీ పనివారలకు వర్తించక పోయినప్పటికీ 1960 నవంబరు 1 వ తేదీన ఈ సంఘం సిఫార్సులు అమల్లో పెట్టబడినాయి.

కార్మికులకై ఉద్దేశించబడిన గృహ నిర్మాణపు పనులు చురుకుగా కొనసాగుతున్నాయి ఫ్యాక్టరీలో పనిచేసే స్త్రీలు పిల్లలు పుట్టకుండా ఆపరేషనులు చేయించుకొన్నట్లయితే వారికి జీతంతో పాటు 7 రోజుల ప్రత్యేక సెలవు ఇచ్చే సౌకర్యం కంపెనీ కలిగించింది. నలుగురు సంతానం కల్గిన పురుషులకు ఉచితంగా ఆపరేషను చేయడం జరుగుతుంది.

## చేతిపనులు

మద్రాసులో జరిగిన జాతీయ వ్యవసాయ ప్రదర్శనంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పాల్గొన్నది.

అఖిల భారత చేతిపనుల సంఘం అధ్యక్షురాలు శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయ హైదరాబాదులోని ప్రభుత్వ చేతిపనులు కుటీర పరిశ్రమల విక్రయశాలను, నిర్మల్ పరిశ్రమను దర్శించి భవిష్యత్తులో చేతివస్తువుల అభివృద్ధికై తీసుకోవలసిన చర్యలను గురించి శాఖాధికారులతో చర్చలు జరిపారు. * * *

# గ్రంథ సమీక్ష

## పరమాణుశక్తి

దేశముయొక్క సాంస్కృతిక వైజ్ఞానిక సాంకేతిక అభివృద్ధికి ముఖ్యమగు పరమాణుశక్తి యొక్కయ విశద ప్రచారమునకు గంభీరముగా గ్రంథరూపమున రచింపబడిన యుత్తమ గ్రంథము- పరమాణుశక్తి. గ్రంథకర్త-శ్రీ వి స్. అప్పారావు-ప్రచురణ- తెలుగు, చరిత్ర, శాస్త్రవిజ్ఞాన ఎకాడమి. పేజీలు 182. వెల 4రు ప్రాథమికాంశములన్ని నిపుణతతో బాలకులకు సులభ గ్రాహ్యమగునట్లు నిర్వహింపబడినవి. పరమాణుకేంద్రముల యొక్కయు వానిశక్తుల యొక్కయు, ముఖ్య లక్షణములు “ఉదాహరణములతో దెల్పబడినవి. నూతన పరిశోధనలతో గూడిన పరమాణుశక్తి శాంతియుతమైన వుపయోగములు, శక్తి సంపాదనా వినియోగములకు మన ప్రభుత్వము జరుపుతున్న యేర్పాట్లు, సంస్థలు విశదీకరింపబడినవి. పంచవర్ష ప్రణాళికలందు బొగ్గు, నూనె, జలపాతములనుండి లభించునట్టి శక్తి రాబోవు ఇరువది యైదు ఏండ్లలో ఏర్పరుపబడనున్న పరిశ్రమలకు చాలదు ఈ కొరత తీర్చుటకు తరుగులేని పరమాణుశక్తి తప్ప అన్యము లేదు అటి అపార శక్తికి సంబంధించిన అనేక వివరములు వివరింపబడుట ప్రజలకు గ్రాహ్యమగునట్లొనర్చుట అత్యవసరము, ఈ అవసరం తీరినపుడు గాని ప్రజలసానుభూతి, అభిమానములు లభింపవు. జనసామాన్యము ఈ గ్రంథమునుచదివిన అనేక ముఖ్యరహస్యముల గ్రహింపగలదు.

రసాయనికమార్పు, నీటిశక్తి, వాయుశక్తి, వాటి రూపాంతరములు ప్రథమ అధ్యాయమందు వివరింపబడినవి. పరమాణు నిర్మాణక్రమము, ప్రోటాను న్యూట్రానుల భేదములు. రేడియో యాక్టివిటి, స్వాభావిక పరమాణుశక్తి పరివర్తన, నాని అయుర్దాయ పరిమితి, ప్రథమ నవీన రసవాద ఫలితములు విపులముగా విశదీకరింపబడినవి. మానవకృత పరమాణు పరివర్తనలో రెండవ ఘట్టమందు, శక్తి విడుదల మార్గములు, ద్రవ్యశక్తుల మొత్తపు పరిమాణ నిత్యత్వసూత్రము, మూడవ ఘట్టమందలి విశేషములు. కేంద్రీకరణ విచ్ఛేదనము యురేనియం తర్వాత నుండు మూల పదార్థములు, పరమాణుకేంద్ర విచ్ఛేదనము మొదలగు కఠిన వైజ్ఞానిక రహస్యములు ఆమూలాగ్రముగా తెలుపబడినవి. పరమాణు శక్తి సంపాదనకు ముఖ్యమగు అవసరములు, వినిధ మార్గములు చదువ శ్రద్ధ గల్గించుచున్నవి.

పరమాణు బాంబు మార్పు, పరీక్ష, ప్రయోగము లందలి మంచి చెడులు, హైడ్రోజన్ బాంబు వివరములు తెలిసికొనుటకు ఇంతకన్న ఉత్తమ ఆంధ్రగ్రంథ మింతవరకు వెలువడలేదు. ఏక స్థానీయముల వివిధోపయోగములు, భౌతిక, వైద్య, జీవశాస్త్రములకు వాని ఉపయోగములు బాగున్నవి. భారతదేశమందు పరమాణుశక్తి పరిశోధన, సంస్థలు చేయుచున్న పనులు వివరింపబడినవి. పరమాణుశక్తి వల్ల దారిద్ర్య, అజ్ఞాన నిర్మూలనా మార్గములు, పరమాణుశక్తిని శాశ్వతమైన పనులకై కొరత లేకుండ ఉపయోగించుకొను మార్గములు అందున్న ఆపదలు అందరూ తెలిసికొనుట ముఖ్యావసరము.

ఈ గ్రంథము ఉత్తమమైనది. శాస్త్రపరిజ్ఞానము లేనివారు సహితము దీనిని చదివిన అనేకమగు రహస్యముల నర్థము చేసికొనగలరు.

దివాకరుని వెంకట సుబ్బారావు

* * *

## బొమ్మలు చెప్పిన కమ్మని కథలు

రచన: శ్రీ సూరిశెట్టి సాంబశివరావు బాబ్జీ

మన ఆధునిక కథా సాహిత్యంపైన విదేశ సాహిత్య ప్రభావం అధికంగా ఉన్నమాట వాస్తవమే కాని మనకూ ప్రాచీన కథా

సంప్రదాయాలు లేకపోలేదు. కాశీమజిలీ కథలు, భట్టి విక్రమార్కుని కథలు మొదలైనవి మన జానపదకథా సాహిత్యంలో చిరకాలం విలువగల అపూర్వ కళా ఖండాలు.

మన కథాకథన పద్ధతికి ఒక ప్రత్యేకత ఉన్నది ఒకేకథ అందులో అనేక కథలు, ప్రతి కథలో మరో ఒకటో రెండో కథలు–ఇలా అనేక కథల సంపుటం ఒకేకథలో ఇమిడి ఉంటుంది. భిన్నత్వంలో ఏకత్వం, ఏకత్వంలో భిన్నత్వం ప్రతిపాదించే మన భారతీయ దర్శనానికి ఈ రకం కథా కథన పద్ధతి ప్రతీకం కావచ్చు.

ఏదేమైనా ఇలాంటి కథాకథన పద్ధతిలో ప్రారంభం కావడమే కథవని. ఇంక అది పాఠకునికి (లేక శ్రోతకు) వినుగు పుట్టేదాకా నిరంతరంగా కొనసాగుతూనే ఉంటుంది

శ్రీ సాంబశివరావు బాబ్జీ మన జానపద సాహిత్యంలో బాగా ప్రఖ్యాతమైన భట్టి విక్రమార్కుని కథలను "బొమ్మలు చెప్పిన కమ్మని కథలు" అన్న పేరుతో చిన్న చిన్న పుస్తకాలుగా ప్రచురిస్తున్నారు. ఇంతవరకు ఈ వరుసలో నాలుగు భాగాలు ప్రచురించారు ఇంకా అనేక భాగాలు రావచ్చు. ప్రచురించిన పుస్తకాలు చిన్నగా హాండీగా 40 పేజీలకు మించకుండా ఉన్నాయి ఒక్కొక్క భాగం వెల 75 నయాపైసలు. ప్రచురించిన వారు ప్రజా ప్రచురణలు వారు ఏలూరు.

ఈ కథాకథన పద్ధతే అసలు పాఠకుని జ్ఞాపక శక్తికి పరీక్షగా ఉండగా ఇలాంటి పుస్తకాల ప్రచురణలో అచ్చుతప్పుల వల్లగాని, తదితర పొరపాట్ల వల్లగాని పాఠకులకు మరింత అయోమయం కలుగకుండా జాగ్రత్త పడడం చాలా అవసరం.

"బాగా డబ్బు సంపాదించిన ఆవేశ్యది చాలా పెద్దకాలం" (మొదటిభాగం 5వ పుట), 'బ్రాహ్మర్ల అబ్బాయి' (రెండవభాగం రెండవ పుట), లాంటి స్వేచ్ఛా ప్రయోగాలు, ఒకే వ్యక్తికి రెండు పేర్లు పెట్టడం–రెండవభాగం 10 వ పుట నాలుగవ పంక్తిలో 'కాంతి రూపుడు' అన్న పేరు, 11వ పుట 14 వ పంక్తిలో కాంచి రూపుడు:– వంటివి ఉత్తరోత్తరా వచ్చే సంపుటాలలో తగ్గించి పాఠకులకు సుఖువు చేకూరుస్తారని ఆశ.

–సురమౌళి

* * *

## గాంధి విజయము

రచన: శ్రీ దామరాజు పుండరీకాక్షుడు మూల్యము: రెండు రూపాయలు ప్రతులకు: స్వరాజ్యసోపాననిలయము, గుంటూరు–2.

సాహిత్యమందు నాటకమున కగ్రస్థానమున్నది. రమణీయమైన కవిత, చతురమైన సంభాషణలు, నిబిడమైన కథా సన్నివేశము, చక్కని పాత్రోన్మీలనముతో ప్రయోగ యోగ్యముగానున్న నాటకమే ఉత్తమ సాహిత్యము. ప్రజల భావములను మార్చుటలో నాటకమున కెంత శక్తి యుండునో యితర సాహిత్య గ్రంథములకు అంతయుండదు. ఈ నగ్నసత్యాన్ని యెరిగినవాడు గనుకనే శ్రీ దామరాజు పుండరీకాక్షుడు స్వాతంత్ర్యోద్యమ సందర్భంగా పలు నాటకాలను రచించి వాటి ప్రదర్శనలద్వారా జాతీయోద్యమానికి దోహదం చేశారు. శ్రీ పుండరీకాక్షుడు వ్రేళ్ళపై లెక్కించదగు కొందరు ప్రముఖాంధ్ర నాటక కర్తలలో నొకరు

1920 లో గాంధిమహాత్ముని అసహాయోద్యమ పిలుపు విని విద్యార్థి దశలోనే ఉద్యమంలో ప్రవేశించి శ్రీ దామరాజు పుండరీకాక్షుడు "గాంధీ విజయము" అను నొక ప్రదర్శనా యోగ్యమైన నాటకమును రచించారు ఇట్టి నాటకమును సంఘసేవా నాట్య మండలి పలుచోట్ల ప్రదర్శించి పలువురి మన్ననలందినది.

1920 నుండి 1935 వరకు అసహాయోద్యమ ఘట్టాలను యెప్పటికప్పుడు యీ నాటకములో చేర్చి ప్రదర్శింపబడుచు తుదకు బ్రిటిషు ప్రభుత్వంచే నిషేధింపబడి వేనకువేలు ప్రతులు తగులబెట్టబడినవి ప్రభుత్వ నిషేధంవల్ల యీ నాటక ప్రతియేదియు ఆంధ్ర దేశములో లభించకుండా పోయింది మద్రాసులో రాజాజీ ప్రభుత్వ మున్నపుడు కీ॥ శే॥ శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు నాటకముపైనున్న ఆంక్షను తొలగింప జేశారు. శ్రీ దామరాజు పుండరీకాక్షుని యితర నాటకాలపైగూడ ఆంక్షయుండెడిది వీటిపై నిషేధం 1947 లో తొలగించబడింది.

గాంధి విజయమును ప్రదర్శించిన నటకులెందరో బ్రిటిష్ హయాంలో శ్రీ కృష్ణజన్మస్థానమును దర్శించారు. ఈ నాటకములో గాంధిమహోదయ ఘట్టము మొదలుకొని 1935 లో శ్రీ నెహ్రూ నాయకత్వాన జాతీయ మంత్రిమండలి యేర్పడువరకు అసహాయ ఉద్యమ ఘట్టాలు చేర్చబడినవి. నాటక కథావస్తువు ఆ నాడు వర్త

మానమైనదే. కాని నేడు చరిత్రాత్మకమైనదిగా మారింది. అయినను నేటికీ రంగస్థల ప్రదర్శనా యోగ్యమైనదే. నాటక మందు వ్యాకరణాంశ లంతగా పాటింపబడలేదు. అక్కడక్కడ రంగస్థల సూచనలున్నవి.

9 రంగములతో కూడిన "గాంధీ విజయము" గద్య పద్యాత్మకము. మొదటి రంగమున ఆంగ్ల పాలనలో భారతమాత తన హైన్యస్థితికి దుఃఖించుట శ్రీకృష్ణ భగవానుడు ప్రత్యక్షమై లోకోద్ధారమునకు గాంధీ అవతారము పొందుట. గాంధీజీ అసహాయ ఉద్యమ పిలుపు వున్నవి 2 వ రంగంలో గాంధీజీ అంహింసా బోధన. 3 వ రంగమున కలకత్తా కాంగ్రెస్ మహా సభ. 4 వ రంగమున పలువురు నాయకులు వెనకు ముంబులాలో చించి తుదకు గాంధీ ఉద్యమాన్నే బలపరచుటకు నిర్ణయించుట. ఆ తర్వాత రంగములందు ఆంధ్రలో ఉద్యమం. ఉప్పు సత్యాగ్రహం. నెహ్రూ నాయకత్వాన జాతీయ మంత్రి మండలి యేర్పడిన ఘట్టాలున్నవి.

గాంధీ విజయం శ్రీ దామరాజు పుండరీకాక్షుని జాతీయ సేవకు చక్కని నిదర్శనం.

"బాలిరెడ్డి"

## ఆషామాషి

రచన: రావూరు ప్రతులకు: ప్రజాప్రచురణలు, పవరుపేట, ఏలూరు. వెల రూ. 1-50 నూరుపుటల గ్రంథమిది. ఆంధ్రప్రభలో ధారావాహికంగా ప్రకటింపబడుతున్న ఉబుసు పోకలాంటి కబుర్లు 'ఆషామాషి' ఈ శీర్షిక క్రింద చేయబడిన రావూరు రచనలు వారి రచనా సామర్థ్యానికి. జీవితంలో కనిపించే ప్రతి చిన్న సంఘటన నుండి హాస్యాన్ని ఒలకించగల వారి కలం శక్తికి చక్కని నిదర్శనలు. ఈనాటి తెలుగు రచయితల్లో హాస్యాన్ని ఒలకించగల వారు లేకపోలేరు. కాని సాంఘిక జీవితంలో నుండి పూచిక పుల్లలాంటి అతి సామాన్య వస్తువును సహితం తీసుకొని, ఇంద్ర ధనుస్సులా రంగురంగుల్లో వర్ణించగల కౌశలం, ప్రతి మాటలోను సుతి మెత్తని హాస్యాన్ని జూపించి, ఎవర్నీ నొప్పించకుండా చదువరులను చక్కిలిగింతలు పెట్టగల ప్రతిభా నైపుణ్యం అందరికీ ఉండటం అరుదు. అందులోను ప్రతిరోజు ప్రవాహ సదృశంగా అట్టి హాస్యాన్ని ఒలికించడం సామాన్యమైన విషయంకాదు

చిన్నచిన్న వాక్యాలలో వెన్నెల విరిసినట్టు, చల్లని పిల్ల తెమ్మెరలు గిలిగింత పెట్టినట్టు, నైర్మల్య రహితమైన చిరునవ్వుల్ని బందించినట్టు, ఇంకా చెప్పాలంటే...మనస్సుల్ని మాధుర్యంతో నింపివేస్తూ వీరి రచనలు సాగిపోతాయి. ఇందులో మంచి ముత్యాలు-మంచి ముత్యాలు, పుడితే విచారం, జన్మదినోత్సవాలు అనే వివిధ శీర్షికలతో మొత్తం ఇరువది రచనలున్నాయి. ఆషామాషిని ఆంధ్రప్రభలో అందరూ చదువుకుంటున్నా గ్రంథ రూపంగా ప్రతిఒక్కరూ భద్రం చేసుకోదగినదే అనిపించక మానదు దీనిని ఆషామాషిగా అంతా ఒక మారు చదువుకోవచ్చు.

## హర్షధ్వనులు

రచయిత:- పి. వి. రత్నం వెల:- 0-75. సోల్ డిస్ట్రిబ్యూటర్స్:- ప్రజాప్రచురణలు, ఏలూరు. రచయిత శ్రీ పి. వి. రత్నం 48 పుటల ఈ గ్రంథంలో ఐదుగురు నాయకుల జీవితాలను రేఖా మాత్రంగా చిత్రించారు. ఈ ఐదుగురు ప్రజామన్ననలను విశ్వాసాన్ని బడసినవారే: వారు శ్రీయుతులు బి. ఎస్. మూర్తి వావిలాల గోపాలకృష్ణయ్య, దామోదరం సంజీవయ్య, అల్లూరి సత్యనారాయణరాజు, పి. వి. జి. రాజు. నాయకత్వమనేది ప్రతి ఒక్కరికీ అబ్బేదికాదు, అట్టి లక్షణాలు అందరిలోను ఉండవు. పదిమంది కేవలం తమచుట్టూ త్రిప్పుకో గలుగడమే కాదు. విజాయితీతో అభిమానాన్ని చూరగొనగలిగిన శక్తి ఉన్నవారే ప్రజా సేవా రంగంలో రాణించి ఉన్నత శిఖరాలందుకోగలరు. వర్తమాన నాయకుల గూర్చి చక్కగా, విష్పాక్షికంగా వ్రాయగలగడం సుకరమైన విషయం గాదు. శ్రీ పి. వి. రత్నం ఈ ఐదుగురు నాయకుల చాలా బాగా చిత్రించగలిగారని ఈ పుస్తకాన్ని చదివిన ప్రతి ఒక్కరికి స్ఫురించగలదు.

## వీరబాలుగు

హిందీనుండి అనువాదం:-శ్రీ వల్లభనేని కాశీ విశ్వనాథం, వెల:- 0-75. ప్రతులకు ప్రజాప్రచురణలు. ఏలూరు అని వ్రాయాలి. ఇది 50 పుటలుగల లఘుపుస్తకం. దీనిలో బప్పరకుడు, జేరాపుర నరేశుడు, రాక్షసుల్ని ఓడించిన రాకుమారుడు, దుర్గాదాస్, స్కందగుప్తుడు, జాలమసింహుడు, ప్రతాప్, రామసింహుడు,

ఛత్ర, పృథ్వీసింహుడు, రాణాచంద్, బాదల్, అజితసింహుడు జుఝూరసింహుడు ఛత్రపాల్ అను కథలున్నాయి. బాలసాహిత్యంలో ఎన్ని పుస్తకాలు వెలువడినా ఇంకా తక్కువే. పిల్లలకు దేశభక్తి, జాతీయతా భావం, స్వాతంత్ర్య పరిరక్షణాకాంక్ష పెంపొందించాలంటే వీర బాలుల కథలు పిల్లలకు చెప్పాలి. వారిలో బుద్ధికుశలత, విశాల దృక్పథం, ధైర్య సాహసాలు, సోదర భావం చిన్నప్పటి నుండి అలవడేలా చేయాలి, అప్పుడే దేశకల్యాణం సుసాధ్యమవుతుంది. కల్యాణి హిందీ పత్రికలో ప్రచురితమైన కథలో మంచిరత్నాలను యేరి శ్రీ విశ్వనాథంగారు తెలుగు బాలలకోసం చక్కని శైలిలో అందించారు. వీనిని చదివిన బాలలకు ఉత్తేజమైన భావాలు ఉన్నతమైన ఆదర్శాలు అలవడటమే కాక వినయ విధేయతలు గూడా అభివృద్ధి చెందగలవు. ఈ పుస్తకంలోని కథలలో ఆయా సన్ని వేశాలకు తగ్గట్టుగా వర్ణనలు నడిచాయి. ప్రతి కథలోను వొళ్లుజలదరింప చేసే సంఘటనలున్నాయి, పిల్లలు అవశ్యం పఠించవలసిన గ్రంథం ఈ 'వీరబాలలు'

—సి. హెచ్. ఆచార్య

*   *   *

## ఆంధ్రయక్షగాన వాఙ్మయ చరిత్ర

[గ్రంధకర్త శ్రీ యస్వీజోగారావు ప్రచురణ: ఆంధ్ర విశ్వకళా పరిషత్, విశాఖపట్నం పుటలు, అనుబంధాలతో కలిపి 800 పుటలు పైగా గలవు. వెల: 10 రు.]

విశ్వవిద్యాలయ విద్యార్థుల వాఙ్మయ చరిత్ర పరీక్షా ప్రశ్నములకు సమాధాన రూపముగా వెలసిన యీ గ్రంథము ఆనర్సువిద్యార్థులకు కొంత ముడిసరుకుగా నుపయోగపడగలదనుటలో సందేహములేదు. ఇందు రెండుభాగములున్నవి, తొలివిభాగము చరిత్రకు సంబంధించినది రెండవది గ్రంథముల పట్టిక వివరణలకు సంబంధించినది. తొలి విభాగమున వాఙ్మయ చరిత్ర యేమియులేదు. ఏదో కొంతగాలి పోగు చేయబడినవి. లబ్ధమైన సామగ్రినుండి క్రొత్తగా గొన్నికొన్ని యూహలు నుపపాదనమును జేసియుంటిని అవి ఖరాఖండి నిర్ణయములుగావు అని యీ గ్రంథకర్త తెలిపినారు. ఇది డాక్టరేట్ ఇచ్చుటకు యోగ్యమైన గ్రంథము. ఏ నిర్ణయమును చేయలేని శోధన కాను పరిశోధన యక్షులకు గాథలున్నట్లు జక్కులకులేవట. అందువల్ల యక్షశబ్దమే మూలమట మార్గదేశికవితలనగా సంస్కృతము ఆంధ్రాది కవితలని నిరూపించుచు వడ్లమూడి గోపాల కృష్ణయ్యగారు ఆంధ్రభూమిలో వ్రాసిన అనేక వ్యాసపరంపరలను వీరు చూచినట్లే కనపడదు. పాత నిర్వచనలపై పరవళ్లు త్రొక్కినారు. దొనగులున్నవన్నవారు పురోభాగాలట ఆ దొనగులను మన్నించినవారు మహాభాగులట. ఇది యీ మహా పరిశోధకుల ఖరాఖండీ నిర్ణయము. ఇట్టి ఖరాఖండీ నిర్ణయములో నున్నవారు ఏ ఖరాఖండీ నిర్ణయమును చేయకయే వ్రాసిన యీ ముడిసరుకును ముద్రించుటతో యూనివర్సిటీ వారు చేసినపని వెక్కిటి వలెనే ఆశ్రిత సంభావనమె.

"యోగనాథ్"

మరచి పొమ్మని బెంగలు మరచిపోము,

అందచందాల బెంగ కాహార మగును;

రమ్ము, ఈ తేనె మామిడి కొమ్మలందు

ఆడుకొందము కోకిల జోడు వోలె,

"మధుగీత"

# ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

## సమాచార, ప్రజాసంబంధశాఖ, హైదరాబాదు

### పట్టిక

**ఇంగ్లీషు**

| | | | రూ. న. పై. |
|---|---|---|---|
| 1 | అరకులోయ | ... | 0 — 60 |
| 2. | ఆంధ్రప్రదేశ్—విశేషాలు | ... | 0 — 25 |

**తెలుగు**

| | | | |
|---|---|---|---|
| 1 | శ్రీ అల్లూరి సీతారామరాజు జీవితచరిత్ర | ... | 2 — 75 |
| 2. | 'ప్రగతి గీతాలు' | ... | 0 — 25 |
| 3. | మూడవ మెట్టు | ... | 0 — 25 |

**ఉరుదు**

| | | | |
|---|---|---|---|
| 1. | ఆహారోత్పత్తి | ... | 0 — 12 |
| 2 | గిరిజన సంక్షేమం | ... | 0 — 12 |
| 3 | మత్స్యసంపద | ... | 0 — 12 |

పోస్టేజి అదనం

ప్రతులను సమాచార, ప్రజా సంబంధ శాఖ

సమాచార కేంద్రంనుంచి పొందవచ్చు.

Edited & Published by the Director of Information & Public Relations, Andhra Pradesh, Hyderabad-1
Printed at Vir Milap Press, Mukarramjahi Road, Hyderabad.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

## విస్తీర్ణం, సివిల్‌డివిజను (1961 జనాభా లెక్కలు)

| | | | |
|---|---|---|---|
| వైశాల్యం | ... | ... | 1,06,052 చదరపు మైళ్ళు |
| జనాభా | ... | ... | 359.8 లక్షలు |
| జిల్లాలు | ... | ... | 20 |
| తాలూకాలు | ... | ... | 189 |
| పట్టణాలు, నగరాలు | ... | ... | 223 |
| జనసాంద్రత ( చదరపు మైలుకు) | | ... | 340 మంది |

## పంచవార్షిక పశుగణన - 1961

| | | | ( వేలలో ) |
|---|---|---|---|
| పశువులు | ... | ... | 121.80 |
| గేదెలు | ... | ... | 69.52 |
| గొర్రెలు | ... | ... | 83.73 |
| మేకలు | ... | ... | 42.66 |
| గుర్రాలు | ... | ... | 73 |
| ఇతర జంతువులు | ... | ... | 6.82 |

## సమాజాభివృద్ధి కార్యక్రమం

| | 1959_60 | 1960_61 |
|---|---|---|
| బ్లాకులు ... | 282 | 326 |
| సగటున వేయిగ్రామాలకు గల బ్లాకులు | 10.66 | 15.52 |
| సగటున పదిలక్షల జనాభాకు గల బ్లాకులు | 7.72 | 15.52 |
| బ్లాకులక్రింద వున్నగ్రామాలు ... | 17,887 | 20,823 |
| బ్లాకు ప్రాంతాల్లో నివసించే ప్రజలు | 1,87,31,000 | 20,701,000 |

## ఖనిజోత్పత్తి

| | | | 1959_60 | 1960_61 |
|---|---|---|---|---|
| బొగ్గు | ... | ... | 2260,000 టన్నులు | 2596,000 టన్నులు |
| ముడిఇనుము | ... | ... | 199,000 ,, | 236,000 ,, |
| మాంగనీస్ | ... | ... | 16,000 ,, | 23,000 ,, |
| అభ్రకం | ... | ... | 3,000 ,, | 3,000 ,, |
| సున్నపురాయి | ... | ... | 766,000 ,, | 1,011,000 ,, |

